ఆబాలగోపాలాన్ని ముగ్ధులను చేసే అద్భుత రసవత్తర చిత్రం




శ్రీరంగా చిత్రాంజలి వారి

# శ్రీకృష్ణ మహిమ

దర్శకుడు పి. సుబ్రహ్మణ్యం రచన అనిసెట్టి

S.M

ఆంధ్ర
అరుణ ఫిలిం డిస్ట్రిబ్యూటర్స్

సీడెడ్
లలితా పిక్చర్స్

నిర్మాతలు
టి బ్రహ్మానందరెడ్డి • కె జె మోహన్

# తొలిమాట

పశ్చిమాసియా అగ్నిపర్వతం ఇప్పుడే మేలుకుంటున్నదా? చల్లారుతున్నదా? (9)

*

అప్పులనగా నేమి? వాని ఉపయోగములేమి? జవాబులకు 17 వ పేజీ చూడుడు.

*

ప్రేమ, ద్వేషం — ఒకే నాణానికి రెండు వైపులు (22)

*

కొందరు పుట్టగానే జోక్స్ వేస్తారు కొందరు కష్టపడి జోక్స్ నేర్చుకుంటారు కొందరు జోక్స్ వేస్తున్నట్టు చెలామణి అవుతారు. మూడో తరగతి హాస్యంపై స్కిట్ బిట్ (37)

*

జీవితంలో ఎందుకూ పనికిరాకపోయినా, ఆసక్తి కలిగించే విషయాలు (41)

*

ఏవి సైగల్ విరుదు పాడిన మధురగీతములు? (54)

*

"ప్రేమ-పెళ్ళి-డబ్బు": ఈ మూడింటికి గల అవినాభావ సంబంధంగురించి కథ (61)

*

స్త్రీకి గొప్ప సౌందర్యం కూడా శత్రువు కావచ్చు. (99)

*

1908 జూన్ 30 వ తేదీ ఉదయాన సైబీరియాలోని వానోవారా వద్ద ఏం జరిగింది? (106)




సుచిత్ర మాసపత్రిక

బకింగ్‌హాం పేట పోస్టు

విజయవాడ-2

విడిప్రతి వెల

80 పైసలు

ఏడాది చందా

9-50 రూపాయలు

సంపుటి 5

జులై 1967

సంచిక 7

మేనేజింగ్ ఎడిటర్

వి. వి. రాఘవయ్య




ముఖచిత్రం:
"దేవుని గెలిచిన మానవుడు"
చిత్రంలో దృశ్యాలు




జూన్ సంచికలో 'కథలాంటి జీవితం' చాలా బావుంది. కథ మొదటినుండి చివరి వరకు సస్పెన్స్‌తో నడచింది. పాఠకులను దుఃఖరసంలో ముంచింది. ఓ. హెన్రీ లాంటి రచయితలను పరిచయం చేయడం పత్రికకు అదొక ఆకర్షణ.

**బుర్రా భాస్కరరావు,**
బెంగుళూరు.

మీరు ప్రచురించే సీరియల్స్‌కు "జరిగిన కథల"ను ప్రచురించక పోవటము బాగాలేదు. మీ పత్రిక నెలకు ఒకసారి వచ్చును. నెల క్రితము జరిగిన (చదివిన) కథను వేరొక మాసము వరకు జ్ఞాపకం వుంచుకొనుట సాధ్యమా?

**కె. కొండలరావు,**
సోంపేట.

జూన్ సంచికలో కె. వి. రామచంద్రమూర్తిగారు రచించిన "ఆశావాదినా? నిరాశావాదినా?" రచన చదివేను రచన చక్కగా, వాస్తవానికి చాల దగ్గరగా వుంది. బహుశా రచయిత, తన రచన "జ్యోతి"లో పడదనుకొని పంపించి వుంటారు. అందుకే ఆ రచన ప్రచురించడం జరిగింది

**వంకాయల విశ్వనాథం,**

జూన్ నెల సంచికలో "నేను ఆశా వాదినా - నిరాశా వాదినా" అన్న రచన నన్ను మిక్కిలి ఆనంద పరచినది. రచయితకు, మీకు నా శతకోటి వందనములు. "ఓ. హెన్రీ" వ్యాసం చాల ఇంట్రెస్టింగ్‌గా ఉంది. 'పరిహారము', "తీర్పు", "వంతెన", "కథలాంటి జీవితం" కథలు చాల బాగున్నాయి. బహుమతి పొందిన 'వర్గం' కథ గంభీరంగా ఉంది. "ప్రముఖుల హాస్యాలు" మమ్మల్ని తెగ నవ్వించేస్తున్నాయంటే నమ్మండి.

నిరాశావాదం ప్రకారం ఈ ఉత్తరం ప్రచురణ కాదనుకొంటూ ఉంటాను.

**యస్. పద్మావతీ చంద్రశేఖర్,**
విశాఖపట్నం.

జూన్ నెల "జ్యోతి"లో ప్రచురించిన భమిడిపాటి జగన్నాధరావు గారి "వంతెన", ఐ. వి. యస్. అచ్యుతవల్లి గారి "కథలాంటి జీవితం", బీనాదేవిగారి "తీర్పు" కథలు చాల బాగున్నాయి. ఇకనుంచి జ్యోతిలో టిట్‌బిట్స్‌కన్నా కార్టూనులు ఎక్కువగా ప్రచురిస్తే బాగుంటుంది.

**చిల్లా శేష, సాంబశివరావు.**



హైదరాబాదులో ఇటీవల కుమారి మోహనకృష్ణ చిత్ర కళాప్రదర్శన జరిగింది చిత్రకారిణిని, ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేసిన ముఖ్యమంత్రిని పై ఫోటోలో చూడవచ్చు.




ఈనాడు ప్రపంచ దృష్టి యావత్తు పశ్చిమ ఆసియామీద కేంద్రీకరించి వుంది.

ఇజ్రాయెల్‌కు, అరబ్ దేశాలకు మధ్య వైరం ఈనాటిది కాదు. ఇరవై ఏళ్ళ క్రిందట ప్రారంభమైంది. మూడుసార్లు అది యుద్ధంగా పరిణమించింది. ఈనాడు వాటి మధ్య యుద్ధవిరమణ జరిగినా శాంతి నెలకొనలేదు. నెలకొనే సూచనలు కూడా కనబడడం లేదు.

పశ్చిమ ఆసియాలో శాశ్వత శాంతి నెలకొనడం ఇజ్రాయెల్, అరబ్ దేశాల మీదనే ఆధారపడి లేదు. అగ్రరాజ్యాల వైఖరిమీద కూడా ఆధారపడి వుంది. వాటి మానాన వాటిని వదలి పెడితే, పశ్చిమ ఆసియాలో తమ ప్రచ్ఛన్న యుద్ధానికి స్వస్తిచెబితే ఇజ్రాయెల్, అరబ్ రాజ్యాలు అవే నెమ్మదిగా ఏదో సమాధానానికి వస్తాయి.

* * *

యూదులు, అరబ్‌లు అసలు ఒక జాతివారే. వారిది సెమెటిక్ జాతి. ప్రపంచంలోని అతి ప్రాచీన జాతులలో అది ఒకటి. అయితే వారి మతాలు వేరు.

యూదులకు కొన్ని వేల సంవత్సరాల చరిత్ర వుంది. ఆ చరిత్రలో ఎక్కువ భాగం విషాద చరిత్రే.

తాము అబ్రహాం సంతతివారమని యూదులు చెప్పుకుంటారు. వారి దేవుడు అబ్రహాంకు ఒక దేశాన్ని మాతృభూమిగా ఇవ్వగలనని వాగ్దానం చేశాడట. ఆ వాగ్దత్త భూమి (ప్రామిస్డ్ ల్యాండ్) కోసం వారు వేలాది ఏళ్ళుగా అన్వేషించారు.

చాలకాలంపాటు ఈజిప్టులో ఖైదీలుగా వున్నారు. మరికొంత కాలం బాబిలోన్‌లో ఖైదీలుగా వున్నారు. తమ దేశం మహమ్మదీయుల [illegible] పోయిన తరాత యూరప్‌కు వలసపోయారు.

## యూదులు, అరబ్‌లు

కాలక్రమాన యూదులు అనేక దేశాలలో చెల్లా చెదరైపోయారు.

సుదీర్ఘమైన వారి చరిత్రలో వారు ఒక జాతిగా, ఒక రాజ్యంగా చెప్పుకోదగిన వైభవం అనుభవించింది డేవిడ్, సాలమన్ రాజుల



మోషే డయాన్

One eye less in Gaza

కాలంలో. అది క్రీస్తుకు పూర్వం వెయ్యి సంవత్సరాలనాడు.

ఆ తర్వాత వారు ఎప్పుడూ హీనమైన జాతిగానే బ్రతుకుతూ వచ్చారు. కాని ఇటీవలి కాలంలో— జర్మనీలో హిటలర్ నియంతగా అధికారానికి వచ్చిన తర్వాత—వారనుభవించిన అవస్థలు మరీ ఘోరమైనవి. యూదు పురుగును లేకుండా చేయాలని హిట్లర్ సంకల్పించాడు. సుమారు 60 లక్షల మంది యూదులను నిర్మూలించాడు.

**అయినా, యూదుజాతి నిర్మూలం కాలేదు. ఒక దేశం అంటూ లేకుండా, అన్ని దేశాలను తమవిగా చేసుకుని ఇన్ని వేల ఏళ్ళు తమ మతాన్ని, జాతిని, భాషను సంస్కృ**తిని నిలబెట్టుకున్న జాతి ఏదైనా వుంటే అది యూదు జాతే.

మొదటి ప్రపంచ సంగ్రామ కాలంలో వారికి పాలస్తీనాలో "నేషనల్ హోం"ను ప్రసాదించగలనని బ్రిటన్ వాగ్దానం చేసింది. ఆ వాగ్దానం రెండవ ప్రపంచ సంగ్రామం తర్వాత 1948 లో గాని నెరవేరలేదు. పాలస్తీనాను విభజించి ఇస్రాయెల్ దేశాన్ని ఏర్పాటు చేశారు. ఇది ఐక్యరాజ్యసమితి అధ్వర్యాన జరిగినపనే.

అయితే, ఇస్రాయెల్ ఆవతరణ సజావుగా జరగలేదు. అక్కడ శతాబ్దాలుగా నివసిస్తున్న అరబ్‌లను వెళ్ళగొట్టారు; వారి భూములను ఆక్రమించుకున్నారు. దీని ఫలితంగా లక్షలాది అరబ్‌లు పొరుగు అరబ్ దేశాలలో తల దాచుకున్నారు. జోర్డాన్‌లో, గాజాలో అరబ్ కాందిశీకులు ఈనాటికీ పడుతున్న దురవస్థలు వర్ణనాతీతం

**అరబ్ రాజ్యాలకు, ఇస్రాయెల్‌కు వైరానికి ఇదే ముఖ్యకారణం. తరతరాలుగా తాము నివసిస్తున్న పాలస్తీనాను సామ్రాజ్యవాదులు విభజించి, ఇస్రాయెల్‌ను సృష్టించి యూదులకు కట్టబెట్టారని అరబ్ జాతీయుల క్రోధం**

ఈ క్రోధంవల్లనే అరబ్ రాజ్యాలు 27 లక్షలకు మించని జనాభా గల ఇజ్రాయెల్‌పై పగ పట్టాయి. దాన్ని నిర్మూలిస్తామని శపథం పట్టాయి. ఇజ్రాయెల్ అవతరణ వెనువెంటనే దానిపై అన్నీ కలిసి దండెత్తాయి. అపజయం పొందాయి. 1956 లో మరొకసారి యూదు – అరబ్ యుద్ధం జరిగింది. అప్పుడూ అవి ఓడిపోయాయి 1967 జూన్‌లో ఇంకొక యుద్ధం జరిగింది. తిరిగి ఇజ్రాయెల్ అరబ్‌లను ఓడించింది.

* * *

మొన్నటి యుద్ధం ఇజ్రాయెల్, సిరియాల మధ్య చిన్న చిన్న ఘర్షణలుగా ప్రారంభమైంది. ఈ ఘర్షణలు చాలా కాలంగా జరుగుతున్నవే. వారిదే బాధ్యతఅని వీరు, వీరిదే బాధ్యత అని వారు ఆరోపణలు చేసుకునేవారు. సిరియన్ కమాండోలు తమ భూభాగంలోకి చొరబడి తమ రైతులను బాధిస్తున్నారని, విద్రోహచర్యలు సాగిస్తున్నారని ఇజ్రాయెల్ వాదం. మా తప్పేమీ లేదని సిరియా వాదం.

ఏమైతేనేం, అరబ్ రాజ్యాలన్నీ ఏకమైనాయి. ఇజ్రాయెల్ సిరియా ప్రభుత్వాన్ని కూలదోసి, తనకు అనుకూలంగావుండే మరొక ప్రభుత్వాన్ని స్థాపిస్తానని అన్నదట. అలాగైతే, ఇజ్రాయెల్‌ను రూపుమాపివేస్తామని ఈజిప్టు ప్రెసిడెంట్ నాసర్ ప్రకటించాడు.

దీనితో, ఇజ్రాయెల్ తనకు రానున్న ప్రమాదాన్ని గ్రహించింది. అరబ్ సేనలు అన్ని వైపులనుంచి దండెత్తివస్తే పోరాటం జరగడానికైనా చాలనంతచిన్నది ఇజ్రాయెల్. ఇట్టే అరబ్‌ల వశమైపోతుంది.

అందువల్ల, ఇజ్రాయెల్ ముందుగానే అటు ఈజిప్టుపై, ఇటు జోర్డన్‌పై, ఉత్తరాన సిరియాపై దాడి చేసింది. అన్ని వైపులా అన్ని దేశాలలోకి దాని సేనలు పురోగమించాయి. కయిరోపై విమానాలతో దాడిచేసింది. దక్షిణాన అకబాను, పడమట గాజా ప్రాంతాన్ని ఆక్రమించుకుంది. సైనాయ్ ద్వీపకల్పాన్ని స్వాధీనం చేసుకుంది. జోర్డాన్‌కు చెందిన జెరూసలెం నగర భాగాన్ని చేజిక్కించుకుంది.

అరబ్ దేశాల సైనికబలం ఇజ్రాయెల్ దానికంటె సంఖ్యలో చాల పెద్దది. కాని, వాటి సైన్యాలకు ఏకైక నాయకత్వం లేదు. ఇజ్రాయెలీ సైన్యంవలె సుశిక్షితం, అధునికం కాదు. అన్నిటిలోకి నాసర్ సైన్యమే అధునికమైనది, బలసంపన్నమైనది. రష్యా చేసిన ఆయుధ సహాయంతో ఈజిప్టు చక్కని సైన్యాన్ని ఏర్పరచుకుంది.

అయినప్పటికి ఇజ్రాయెల్ ధాటికి ఈజిప్టు నిలవలేకపోయింది. దాని మిగ్ విమానాలు నేల మీదనే ధ్వంసమైనాయి. టాంకులు ధ్వంసమైనాయి. ఈ దశలో భద్రతా సంఘం కలగజేసుకుని యుద్ధ విర



హెర్క్యులిస్ కోరాడు.

"హెర్క్యులిస్‌మీద పెట్టుబడి పెట్టినందుకు ఎంతో సంతోషము. దగ్గరి పెద్ద ఊరు ఎంత దూరమైనా ప్రతిరోజు వెళ్లి వస్తూంటాను. నా హెర్క్యులిస్ నా జీవితంలో ఒక భాగము."

**సైకిలు జీవితాంతం**
**ఉపయోగపడుతుంది**
**హెర్క్యులిస్ మీ సొత్తుకు**
**మంచి విలువైనది**

విశిష్టమైన రకము, మితమైన వెలతో హెర్క్యులిస్ బైసికిళ్ళలో ఆదర్శమైనది. ఎంతమాత్రము ఆశ్చర్యము లేదు. ప్రపంచమంతటా 135 దేశాలలో ఎక్కువగా అందరూ వాడేదే ఇది. సౌత్ ఈస్ట్ ఏషియాలో మద్రాసు నందు మంచి సాధన సదుపాయాలు కలిగిన పెద్ద సైకిల్ ఫ్యాక్టరీలో అంతర్జాతీయపు అర్హతలకు అనుగుణ్యంగా తయారుచేయబడింది. హెర్క్యులిస్ ప్రపంచంలో పెద్ద సైకిళ్ళ ఉత్పత్తిదారులైన ట్యూబ్ ఇన్వెస్ట్మెంట్స్ లిమిటెడ్, యు కె వారి సౌజన్యంతో ఖచ్చితముగా నిర్మింపబడినది.



# హెర్క్యులిస్

**ఒక్క సైకిలే కాదు**
**జీవితకాలపు నేస్తము**




వెల విశిష్టత,బలిష్టత మన్నిక అందము అన్నిటి లోను హెర్క్యులిస్ సొమ్ముకు మంచి విలువైనది.

® ది హెర్క్యులిస్ సైకిల్ మరియు మోటార్ కంపెనీ లిమిటెడ్ యు కె వారి రిజిస్టర్ ట్రేడ్ మార్కులు ఇండియాలో తయారీ. టిఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా అంబత్తూరు మద్రాసు 53 ప్రొప్రైటర్లు; ట్యూబ్ ఇన్వెస్ట్మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ మద్రాసు 1 ఉపయోగించుటకు రిజిస్టరుకాబింపబడిరి. చిన్న మొత్తముం శేకరణలతో ఆదా చేయుండి tic h 3824

మణ జరగాలని ఆదేశించింది. మొదట బింకం ప్రదర్శించినా ఈజిప్టు కూడా దీనిని అంగీకరించింది. యుద్ధ విరమణకు సమ్మతించింది.

యుద్ధవిరమణ జరిగినా పశ్చిమ ఆసియాలో శాంతి ఏర్పడలేదు. ఇజ్రాయెల్ తాను ఆక్రమించిన అరబ్ భూభాగాలలో తిష్ఠవేసుకుని కూర్చుంది. అది వైదొలగితేగాని శాంతి ఏర్పడదు.

కాని, ఇజ్రాయెల్ తన సేనలను ఉపసంహరించుకుంటుందా? ఏ నాలుగు వేల ఏళ్ళనాడో ఈజిప్టు యూదులను ఖైదీలుగా తీసుకుపోయి బానిసలుగా చేసింది. ఆ తర్వాత బాబిలోన్ (ప్రస్తుతపు ఇరాక్ రాజధాని)లో వారు బానిసలుగా అష్టకష్టాలు పడ్డారు. ఈ గత చరిత్రను జ్ఞాపకం పెట్టుకుని వారీనాడు అరబ్‌లపై కసి తీర్చుకుంటూరా?

జెరుసలేంను సాలమన్ రాజు (క్రీస్తుపూర్వం 960 ప్రాంతాలు) నిర్మించాడు. ప్రాచీన యూదు రాజ్యం "జూడా"కు అది రాజధాని. దాన్ని వదలిపెట్టేది లేదని ఇజ్రాయెల్ రక్షణమంత్రి మోషే డయాన్ ప్రకటించాడు.

గాజా యూదు పౌరాణిక వీరుడు శామ్సన్ నివసించిన స్థలం. సైనాయ్ ద్వీపకల్పంలోని మౌంట్ సైనాయ్ శిఖరం మీదనుంచే యూదుల ప్రవక్త మోజెస్ టెన్ కమాండ్‌మెంట్స్ ప్రవచించాడు. సాలమన్ రాజు కాలంలో అకబా సింధుశాఖ గుండా యూదు నౌకలు ఎర్రసముద్రంలోనికి వెళ్ళి ఇతర దేశాలతో వాణిజ్యం చేసేవి.

అయితే, ఇవన్నీ పురాణం కథలు, చారిత్రక గాథలు. వీటికి, ఈనాటి ప్రపంచ పరిస్థితులకు సంబంధం లేదు. అరబ్బులు, యూదులు ఎన్నటికైనా ఇరుగు పొరుగున నివసించవలసినవారు. ఇజ్రాయెల్‌ను అరబ్ రాజ్యాలు గుర్తించాలి. దానికి బదులుగా ఇజ్రాయెల్ తాను మొన్న ఆక్రమించిన అరబ్ ప్రాంతాల నుంచి ఉపసంహరించుకోవాలి.

ఈ ప్రాతిపదికపైనే పశ్చిమ ఆసియాలో శాంతి సాధ్యం. కాని, అమెరికా ఇజ్రాయెల్‌ను, రష్యా అరబ్ రాజ్యాలను వెనకేసుకొస్తున్నాయి. తమ తగాదాలను వీటి ద్వారా తీర్చుకోవాలని చూస్తున్నాయి. అవి రెండూ ఒక సమాధానానికి వస్తే ఇజ్రాయెల్‌కు, అరబ్ రాజ్యాలకు సంధి చేయడం కష్టం కాదు. అదే ఇప్పుడు జరగాలి. ఈ సంధి ఐక్యరాజ్యసమితి గ్యారంటీ క్రింద జరిగితే మరీ మంచిది.

# విశృంఖలం

ఈగ
జోరీగ
తూసీగ
వీణ తీగ

అయిందక్కడికో పద్యం.
మువు కాదన్నా ఇదే కవిత్వం.

ఏయ్
మొద్దు
హద్దు
పద్దు

తోచినదేదో చెప్పెయ్
రిథమ్ ముసుగులో కప్పెయ్.

జ గణం
మ గణం
భ గణం
తీసుకురా అమృతాంజనం

ఈ గణాల రణ గొణ ధ్వని
లేదు మనకు వీటితో పని

ఇలా నాకు తోస్తే
కాగితం పైకి తోస్తా
మెచ్చి కవిత్వమంటే
చిన్న టీ పార్టీ యిస్తా.

మహాకవి శ్రీశ్రీ—
దయ గలవాడు
కరుణశ్రీ—
ఇంకా ఉన్నారు
హితశ్రీ
మితశ్రీ
జతశ్రీ
ఎక్సెట్రీ.

అబ్బ
పోతా వేమిట్రా
ఇట్రా!
సిట్ రా!
మరి నా పేరూ విను!
కాస్త చద్దెన్నం తిను.
ప్రతి "శ్రీ"
కవితలో "శ్రీ"–
నటుల్లో
శ్రీలు "శ్రీ"–
నేను
వి శృంఖల "శ్రీ"
ఏయ్
మొద్దు
హద్దు
వద్దు
అక్కడి నుంచి
కదలొద్దు
అంటే అవుతుంది ఆర్డర్
లేదు నీకు నాకు బార్డర్
కాబట్టి పోఖరా బ్రదర్
ఏయేయేయ్
ఆగాగు
ఇంకో చిన్న
అయిడియా:
ఎఱ్ఱ"న"
తిక్క"న"
మల్ల"న"
నీ పేరు చివర
పెట్టుకో "న"
నీవూ అవుతావు
కవివి, కావున
ఇక పోవుదున?
టాటా (డాధాఖ!)

— "కెలెన్ హెల్లర్" —

# అప్పులు

కె.వి.రామచంద్రమూర్తి



...మీద ముళ్ళపూడి వెంకటరమణగారు రాసినంత థరోగా తెలుగులో ఇంకెవ్వరూ రాయలేదు. ఆయన ఈ సబ్జక్టుమీద చాలకాలం పరిశోధనలు చేశారు. అశోకుడి శిలాస్తంభాలు, పూర్వపు రాజుల శిలా శాసనాలు, తామ్ర శాసనాలు, దాన శాసనాలు, తాళపత్ర గ్రంథాలు ఇంకా ఏవేవో భూతద్దం పట్టుకుని పరిశీలించి, ఎన్నో అమూల్య విషయాలు కనిపెట్టినట్టు కొందరు చెబుతారు.

ఆయన అవన్నీ క్రోడీకరించి ఒక పెద్ద థీసిస్ రాశారు. అప్పారావు గారు గిరీశాన్ని సృష్టించినట్టు ముళ్ళపూడివారు అప్పారావును కల్పించి సాహిత్య లోకంమీదికి వదిలారు. ఆంధ్రా యూనివర్సిటీవారు ఎప్పటికైనా అప్పులమీద డాక్టరేట్ ఇవ్వాల్సివస్తే ముళ్ళపూడి వారికి డి. ఎల్. (డాక్టర్ ఆఫ్ లోనాలజీ) డిగ్రీ ఇవ్వచ్చునని సిఫార్సు చేస్తున్నాను.

ముళ్ళపూడి వారిని మించిపోగలనని కాదుగాని, నేను కూడా ఈ మధ్య ఈ సబ్జక్టు మీద కొంత పరిశ్రమ చేశాను. ఆయన అన్నట్టు అప్పులమీద ప్రపంచం నడుస్తోంది. నిప్పులమీద నడవని వాళ్ళు చాల మందున్నారు గాని, అప్పులమీద నడవనివాడు వుండడు. అప్పుల అవసరాన్ని గుర్తించబట్టే అప్పిచ్చువాడు లేని వూళ్ళోకి పోవద్దని సుమతీ శతకం రాసిన పెద్దమనిషి అన్నాడు.

నేను అప్పుల విషయమై కనిపెట్టిన ముఖ్య సూత్రం ఒకటుంది. ఈ అప్పులనేవి ఘటనా ఘటనా సామర్థ్యం కలిగినవి. పూర్వకాలంలో మన పురాణాల్లోని వీరులు బ్రహ్మాస్త్రాలని, వారుణాస్త్రాలని, ఆగ్నేయాస్త్రాలని ఎన్నో రకాల అస్త్రాలు ఉపయోగించే వారట. కాని, వాటన్నిటిని మించినది 'అప్పాస్త్రం.' దీన్ని తెలివిగా ఉపయోగించుకోవాలేగాని ... మిత్రుడుగా,

మిత్రుడినిశ ... గా

చేసుకో...

మ

ఉన్నా

డుగా చే

వాడు చా

ప్పుకు య

'ఏమోయ్




వున్నట్టున్నా" వని సముదాయించి వాడి అవసరం తీర్చండి. బలవంతాన అయినా అప్పు అంటగట్టండి. అంతే, వాడిక మీకు గులాం అయిపోతాడు. మీరు కనబడితే అర్ధగజం వెడల్పున నోరు పెద్దది చేసుకుని నవ్వుతాడు. వాడి వద్ద మీరు వేసిన ప్రతి హిట్టు బాక్సాఫీసు హిట్టు అవుతుం .

ఇక మిత్రుడు శత్రుడు కావడం: కావాలని మనం మిత్రుడిని శత్రువుగా చేసుకోమనకోండి. కాని, ఇద్దరు అగర్భ మిత్రులను విడదీయాలనే దుర్బుద్ధి మనక ... 'అప్పా స్త్రాన్ని'

అప్పు
ద్దరు
భగ్గు
నో
పంచ
కలిసి.
రేంలేదు:
డి దగ్గర

**అప్పు తీసుకునేట్టు**

రోష్ ఫూకో. ఈ పే ... తప్పు పడితే ప్రమా ... గ్రహించే శ్రీశ్రీ తన నేయం ఒక దానిలో La Roche foucauld అని ఇంగ్లీషు స్పెల్లింగు ఉపయోగించారు.) అనే ఫ్రెంచి రచయిత ఒకచోట ఒక మహా వాక్యం రాశాడు: "చేసిన అప్పును మరీ తొందరగా తీర్చడం ఒక రకం కృతఘ్నత."

ఒక అప్పారావు అర్జంటుగా కావాలని మన దగ్గిర పాతికో పరకో పుచ్చుకుంటాడనుకోండి. రేపు సాయంత్రానికల్లా ఇచ్చేస్తానంటాడు. ఇది జరిగేది కాదని మనకి తెలుసు. తెలిసికూడా 'దొరికాడురా అప్పారావ్ ఇన్నాళ్ళికి' అని ఆసామి అప్పారావు అన్న ప్రకా




జ్యోతి

రం మర్నాటి సాయంత్రానికల్లా ఖచ్చితంగా అణా పైసలతో సహా అప్పు తీర్చేస్తాడు.

ఇలా తీర్చేసినప్పుడు మనకి కలిగే ఆశాభంగం చెప్పడానికి మాటలు చాలవు. అప్పు తీర్చేస్తానని చెప్పిన టైముకి తీర్చెయ్యడం కంటె మిత్రద్రోహం మరొకటి లేదు. వెనకపాటుగా బాకు పోటు పొడిచినట్టే. ఎంత పొగరు, ఎంత అహంభావం, ఎంత విశ్వాస ఘాతుకుడు అని మనస్సులో కుతకుతలాడిపోతాము. వాణ్ణి జన్మలో మరి క్షమించలేము.

చెప్పిన టైముకి అప్పు తీర్చకనకోండి. ఎన్నాళ్ళకీ తీర్చకనకోండి. ఇహ చెప్పేదేముంది? మనల్ని యమదూతకి పర్యాయపదంగా వాడేస్తాడు వెధవ, ఛండాలుడు, దరిద్రుడు — అప్పిచ్చిపైగా ఎలా నవ్వుతున్నాడో చూడు; అడగనైనా అడగడేం? ఇత్యాది శాపనార్థాలు పెడతాడు.

అందుచేత అప్పు తీర్చినా, తీర్చకపోయినా శత్రుత్వం తప్పదు. మిత్రభేదానికి మారు పేరు అప్పు. ఫ్రెంచి తత్వవేత్త, గ్రంథకర్త జాంపాల్ సార్త్రే ఎగ్జిస్టెన్షలిజం అనే తన సిద్ధాంతాన్ని అప్పుల మీదనుంచే డెవలప్ చేశాడని కొందరు విమర్శకులు ఈ మధ్య నిరూపించారు. నువ్వు మంచిపని చేసినా, చెడ్డపని చేసినా దానివల్ల దుష్ఫలితాలు తప్పవు; అసలికే ఈ ప్రపంచం




అంతా ఒక పెద్ద 'అబ్సర్డిటీ' అని సార్త్రే సిద్ధాంతంలోని సారాంశం. 'అప్పు తీర్చినా, తీర్చకపోయినా ఒకటే; శత్రుత్వం తప్పదు' అనే గొప్ప సత్యం నుంచే అతడు తన ఎగ్జిస్టెన్షలిస్టు ఫిలాసఫీని తయారు చేశాడట.

అప్పారావుల్లో చాలా రకాల వారున్నారు. ఒకడికి బొత్తిగా మతిమరుపు. క్షణం క్రితం చెప్పిన విషయమే జ్ఞాపకం వుండదు. ఇక ఆర్నెల్ల కిందట చేసిన అప్పు సంగతి జ్ఞాపకం వుంటుందా?

ఒకసారి ఒక అప్పారావును అప్పిచ్చిన అప్పాజీ బజార్లో నిలేశాడు. వారి సంభాషణ ఇలా సాగింది:

"ఏమోయ్. బాకీ తీరుస్తావా ? లేదా ?"

"ఏం బాకీ ?"

"ఆర్నెల్లకిందట తీసుకున్నావుగా యాభై రూపాయలు ?"

"నేనా ? యాభైరూపాయలా ? అప్పా ? తీసుకున్నానా ?"

"దబాయిస్తావేమిటోయ్ ? ఆర్నెలనాడు నువ్వు పొద్దున్నే మొహం కడుక్కోకుండా మా ఇంటికి పగెత్తుకు రాలా ?"

"వచ్చాను."




"మీ ఆవిడకి జబ్బుగా వుందని, మందులు కొనడానికి యాభై రూపాయలు అర్జంటుగా కావాలని అడిగావా, లేదా ?"

"అడిగాను."

"నా దగ్గర లేదనలా నేను ?"

"అన్నావు."

"నా చేతులు పట్టుకుని ఇవి కాళ్ళుకావు చేతులనుకో. ఈ చేతులోనే దబ్బివ్వమని ప్రాధేయపడ్డావా లేదా ?"

"పడ్డాను."

"నేను ఎక్కణ్ణించో తెచ్చి నీకిచ్చానా లేదా ?"

"ఇచ్చావు."

"మరి లేదంటావేం ?"

"ఏమిటి ?"

"బాకీ !"

"ఏం బాకీ ?"

ఇల్లా మళ్ళీ మొదటి కొస్తుంది. మొండివాడు రాజు కంటె బలవంతుడంటారు. అప్పారావు మొండి వాడికంటె బలవంతుడైతే యాభై రూపాయలకి నీళ్ళు వదులుకుని మన దోవన మనం చక్కాపోవలసిందే

ఒక అప్పారావు డబ్బారావు (డబ్బు గలవాడు డబ్బారావు)ను "నేను మద్రాసు వెడదామనుకుంటున్నా. రాగానే తీర్చేస్తాగాని ఓ పాతిక సర్దు" అని అడిగాడు. డబ్బారావు ... కుని "ఎప్పు ... ఎ ?"

అని అడిగాడు. 'ఆ. ఇప్పుడెక్కడ? ఇంకో ఏడాది పడుతుంది' అని అప్పారావు జారుకున్నాడు.




ఒక జి. అప్పారావు (గురజాడ వారు కాదు; గడుసువారు) డబ్బారావును "నీకు పది రూపాయలు బాకీ వున్నట్టున్నా కదూ?" అని అడుగుతాడు.

"అవును."

"ఇంకో పదిస్తే, ఆ పదీ ఈ పది హేను, అదీ ఇదీ కలిపి ముప్ఫయవుతుంది ఏకంగా నలభై ఇచ్చేస్తాను. గాని, ఓ యాభై వుంటే సర్దుతావా?" అని అడుగుతాడు పంచ పాండవు లెందరంటే మంచం కోళ్ళలా... అనే విట్టు కల్పించింది ఈ అప్పారావు పూర్వీకుడేనట.

ఇటువంటి ఋణగ్రహణ పారీణులెన్నో గిట్టనివారు "బాకీస్తాన్ పౌరులు" అంటారు. వీరు కుశల ప్రశ్నలు వెయ్యడంలో కూడా "అంతా బాగా వున్నారా?" అని అనడానికి నోరు తిరగక "అంతా బాకీ వున్నారా?" అని అడుగుతారు.

గ్రామదాన్, భూదాన్, శ్రమదాన్, జీవనదాన్ ఇత్యాది దానాలెన్నో కనిపెట్టిన ఆచార్య వినోబా భావేగారు ఋణదాన్ ఉద్యమం ఎందుకు లేవదీయలేదో?

ఋణ దానోద్యమాన్ని కూడా ఆయన ప్రారంభించివుంటే అప్పారావులందరు ఆయనకి బ్రహ్మరథం పట్టి "వినో బాకీ జై!" అని ఋణగుణ ధ్వానాలు చేసేవారు గదా?

ఇతి ఋణ్వేదం!

***



# ద్వేషం

ఎస్.ఆర్. నంది

మహానుభావా! మీకో శతకోటి నమస్కారాలు! మీ ప్రపితామహులాది పెద్దలకో సహస్రకోటి వందనాలు నన్నా సీట్లోనించి మార్చెయ్యవద్దు! అంతే తల గుమాస్తా విసిపిచుకోకపోతే, ఖర్మ, నేనేం చెయ్యాలి? పైగా గుండు మీద ఏరియల్ వంకీలా క్వశ్చన్ మార్క్ మొహమెట్టి వైయ్యి, గియ్యా, అని అడుగుతాడు ఏమని సమాధానం చెప్పాలి? చెప్పిన భావం, భాష్యం ఆయనకు అర్థమైయేదిక్కీగా? మధ్య నాకొచ్చి పడింది చావు! ఇలా మరో పద్దినాలుంటే నిజంగా పిచ్చెక్కేట్టు వుంది! ఏం చెయ్యాల్రా రాముడూ?—

అని లంచి అవర్లో — నీవు తప్ప నితఃపరం బెరుగ నన్నట్టు 'ఉపాయాన్వేషణలో' కొట్టుకు పోతున్న శర్మ గోలెట్టేస్తున్నాడు.

అర్థించాడుగా— అభయహస్తమిచ్చేట్టు గాఢంగా ఓ దమ్ములాగి "అయితే ఆ సీట్లోనించి మారిపోతానంటావ్!" అన్నాడు.

"అందుకేగదరా ఈ కంఠ శోష? ఆఫీసరుడికి చెప్పుకుందామంటే, అతనూ ఈ తల గుమాస్తాకంటే రెండాకులు ఎక్కువే చదివాడాయిరి! కారణాలు అడిగితే ఏమని చెప్పుకోవాలి?"

"నిజం చెప్పేసెయ్."

"ఏమని? ఆ నల్లపిల్ల ఎదురుగ్గా కూచుని పనిచెయ్యడానికి నానా ఇబ్బందిగా వుందనా?"

"ఆఁ"

"ఏడ్చినట్టుంది. అంత మాటా వుసుక్కున అనేశానే అనుకో: దాంతో ఆయనో ఛార్జ్‌షీట్ యిచ్చేస్తే?"

"ఛార్జ్‌షీట్ ఎందుకిస్తాడు?"

"ఇడియట్లా మాట్లాడకు. నేను కోరేదాంట్లో సబబేమన్నా వుందా?"

"అయితే నోర్మూసుకు కూర్చో."

మహారాజని మొరెట్టుకుంటే - అన్నట్టుయింది శర్మగతి! ఈ ఆఫీసర్ కూడా పెడమ్యూలు కాస్తే. 'లేదు సార్! ఆ లక్ష్మిఎదురుగా కూచోవడం కష్టంగా ఉందంటే కారణం అడుగుతాడు. ఆ కారణం తన దగ్గర లేదు. ఇదేదో కాంప్లెక్స్‌తో బాధ పడే మనిషని తనని ఈ పూర్ణించే బదిలీ చేసేస్తే ఏం గతి?

అసలు లక్ష్మి అంటే తన కెందుకంత కోపం? చూస్తే చాలు ఒంటికాలు మీద పట్రున లేస్తాడు.

ఆఫీసు పదింటికైతే ఆమె తొమ్మిదిన్నరకే ఆఫీసుకి తగలడుతుంది. సాయంకాలం ఆయిదయే వరకూ కట్టేసినట్టు సీట్లోనే పడేసుస్తుంది.

ఖర్మకాకపోతే తను యిదిసి కావడమేమిటి? ఇలాంటి కుండపెంకు ఎదురుగా సీటు కొరుకుతుందని (దివ్యదృష్టితో) తెలిసుంటే ఆ బియ్యే చదివుండేవాడు కాదుగదా!



ఆ నుబ్బిగాడు – చంద్రుళ్ళేని ఆకాశంమాదిరి చుక్కల మోహమూ వాడున్నూ – శారద పక్కన సీటు కొట్టేశాడు! వెధవలో ఛారమ్ లేదు, షివల్రీలేదు. శారద గలగల నవ్వినప్పుడైనా నవ్వగలుగుతాడో లేదో! ఏదైనా పెట్టి పుట్టాలంటారు : ఇదే కాబోలును!

ఇప్పుడప్పుడే ఓ పుష్కరం లోపున ప్రమోషన్లొచ్చే సూచన్లేవీ లేవు. ఈ మధ్యలో తనకంటే ముందున్న ముప్ఫై నలభైమంది సీనియర్లు భూకంపం లాంటి దొచ్చి గుటుక్కుమంటే తప్ప తనకి ప్రమోషన్ రాదు. (ఇందరు ఎమ్మెల్యేలు, ఎంపీలు వున్నారు : స్టీల్ ఫ్యాక్టరీ ఆంధ్ర దేశానికి రప్పించలేకపోతే పొయ్యారు – కనీసం భూ కంపాల నైనా రప్పించలేరు!) అందాకా ...టకి ముందు కూచుని ఊరశ్రీ, ...మాది అప్సరసల్ని ఊహించు ...వా, ఎలా కాలం గడపాలో ...ంగాక శర్మ తల బాదుకున్నాడు!

కనిపించిన ప్రతీ వాడితో ఇదే గోల! ఏమో ఏ వెధవేం వారగ బెట్టేస్తాడో అని! కాని ఒక్కడు – ఒక్క వెధవన్నా తన బాధ నర్థం చేసుకోడేం? మొన్ననో సారి ఆ నూరిగాడితో చెప్పుకుంటే–

'లక్కా! ఆమె కేమోయ్? ఎనాటమీ ప్రకారం చూస్తే ఆమె శారద కంటే అందగత్తె కదా!' అని ఓ చిన్న కాంప్లిమెంట్ పారేశాడు.

'అందానికి ఆ నూరిగాడిచ్చే డెఫినిషన్ ఏమిటో? వెనకనించి చూస్తే అతను మధ్య వరూధిన్లా వుంటుందట! కొంపదీసి ఆ వొయ్యారిని ఈ వెధవగాని లవ్ చేస్తున్నాడేమో కర్మ!

'అయితే నన్నేం చెయ్యమంటావయ్యా? నా మానాన నన్నిలా వదిలేస్తారా మీరంతా కలిసి?' ఏడుపు ముఖం పెట్టి ఏడ్చాడు శర్మ.

రామ్మూర్తి మరోసారి గాఢంగా దమ్ములాగి 'అసలా అమ్మాయంటే నీకెందుకురా అంత యిది?' అన్నాడు.

ఆ 'అంతయిది' ఈ వెధవ తనలా ఆ తాగు డబ్బాగుండు పగలంతా కూచునివుంటే తెలిసొచ్చేది. చూస్తే చాలు దోకొచ్చే ఆ ముఖద్యుతులు, ఆ స్వరూపానికితోడు రెండు జడ...టు – రెండు జడలు. ఆ జడల్లో సన్నజాజులు, సంపెంగెలు, గులాబీలు లేనప్పుడు బంతిపూల అలంకరణ! ఛీ! పూలని సెలెక్టు చేసుకోవడంలో కూడా ఆడవాళ్ళ మనస్తత్వం వ్యక్తమవుతుందిలా వుంది.

శారద మల్లెపూలు (ప్లాస్టిక్ వి అయితే మటుకు) పెట్టుకుంటుంది. చేతుల్లేని జాకెట్ వేసుకుంటుందని కొందరు విమర్శక శిఖామణులు విమర్శిస్తారేగాని, ఆ జాకెట్ లో ఎంత లావణ్యమూర్తిలా ఉంటుంది మరి? ఆమె కాలిగోటికి కూడాసాటి రాని ఈ నల్లరాయి, ఎనాటమీ

ప్రకారం ఆలోచిస్తే అందాల రాసిట! ఫ్!

రామ్మూర్తి సీటు మార్చే ఉపాయాలు చెప్పకుండానే ఆఫీసులోకి వచ్చేశాడు.

శర్మ సీట్లోకి రాగానే ఆ నల్లమ్మాయి అతని దగ్గర కొచ్చింది. ఏదో పరిమళం గుప్‌మంది. శారీరకమైన వికృతాలని కప్పుకునేందుకు ఆడవాళ్ళు ఎన్నిరకాల సూత్రాలని కనిపెట్టారు! కొన్ని కీటకాలు కూడా 'అపోజిట్ సెక్స్'ని ఆకర్షించేందుకు యిలాంటి సౌరభాన్నే వెదజల్లుతాయట! ఈ పిల్లది కూడా బహుశః అలాంటి పురుగుల తత్వమేనేమో!

ఇన్‌కమ్ టాక్స్‌కి సంబంధించిన వివరాలు కొన్ని మీ లెడ్జర్‌లో ఉన్నాయి. దయచేసి ఆ ఇన్ఫర్మేషన్ దీనిమీద ఎండార్స్‌చేసి యిస్తారా?" అంది లక్ష్మి.

చూసుకో తల్లీ కావలిస్తే అన్నట్టు సీట్లోనించి లేచి బయట కెళ్ళి పోయాడు.

పది నిమిషాలయాక తిరిగొచ్చాడు. సీటు దగ్గర ఆ 'లావణ్య మూర్తి' లేదు. ధైర్యంగా వచ్చి సీట్లో కూచున్నాడు.

"ఇన్ఫర్మేషన్ దొరకలేదండి" — జీడిగింజలా వచ్చి మళ్ళీ పట్టుకుంది.

శర్మకు చిరాకేసుకొచ్చి లేచి పోయాడు పోవాలని.

"ప్లీజ్! ఈ కేస్ ఇవాళ డిస్పాచ్ చేయాలి."

"అయితే నేనేం చెయ్యాలి?" చిరాగ్గా అని "అవిగో లెడ్జర్స్ — చూసుకోండి కావలిస్తే" అన్నాడు.

"కనిపించ లేదండి"

శపించుకుంటూ లెడ్జర్ విప్పాడు.

ఒక పెద్దమనిషి, మరో యువకుడు ఆస్పత్రి ముందు కారు దిగారు. యువకుడి కాలు వాచి వుంది. పెద్దమనిషి యువకుడిని మెల్లిగా నడిపించుకుంటూ డాక్టరు దగ్గిరికి తీసుకు వచ్చాడు.

"మా కాబోయే అల్లుడికి కాలు విరిగింది. మీరు వైద్యం చెయ్యాలి" అన్నాడు.

"ఎలా విరిగింది?" అన్నాడు డాక్టరు.

"నిన్న కోపం వచ్చి కర్ర విసిరాను. దాంతో ఒక ఎముక తొలిగింది."

"అదేమిటి, మీ కాబోయే అల్లుడి మీద మీరు కర్ర విసరడం తప్పు కాదా?" అని డాక్టరు అడిగాడు.

"అప్పటికి ఇతని సంబంధం ఇంకా నిశ్చయం కాలేదులెండి" అన్నాడు పెద్దమనిషి సిగ్గుపడుతూ.

రెండు వందల నాలుగో పేకీ తీసి ఆమె కిచ్చాడు.

ఆమె నిట్టూర్పు విడిచి నోట్ చేసుకొని ఎదుటి సీట్లోకి వెళ్ళిపోయింది.

"చూడండి లక్ష్మీదేవి గారూ! మీ రిలా అస్తమానం డిస్టర్బ్ చేయడం బావుండలేదు. మీ కేవన్నా ఇన్ఫర్మేషన్ కావాల్సొస్తే — లెక్చరర్సన్నీ యిక్కడే పడున్నాయిగా — మీరే దయచేసి చూసుకొంటే నన్ను రక్షించిన వారవుతారు!"

గట్టి వాక్యంగే యిచ్చాననుకున్నాడు శర్మ. ఈ దెబ్బతో తల గిరవనిలి వుంకొచ్చు కాని తలెత్తినపుడల్లా ఆ నీల మేఘచ్ఛాయను తప్పించుకోకుండా ఎలా ఉండటం? ఓ గజం గుడ్డ తీసుకొచ్చి మధ్య పరదాలా కట్టేసుకుంటేనో?

ఆ అమ్మాయి గురించి జాలిపడాలనిపించదు శర్మకెప్పుడూ. తన వీధిలో, చివరింట్లో, ఎప్పుడూ డిటెక్టివ్ నావెల్స్ చదువుకుంటూ కూచునే ఓ నల్లమ్మాయ్! ఆ అమ్మాయిని చూస్తే వాళ్ళు గగుర్పొడుస్తుంది ఎంతో ఇదిగా! ఆ అమ్మాయి కూడా రెండు జళ్ళే వేసుకుంటుంది. ఏకలవ్యుడు వంచిన విల్లులా వంగుతాయి వాతెరలు ఆమె నవ్వినపుడు. ఎంత ఆకర్షణ వుంది ఆ అమ్మాయిలో మరి!

కాని ఈ లక్ష్మితో అలా అనిపించదు సరిగదా, కనిపిస్తే పుడ్చాబ్లా తన్ని, బొంగ్రీ ఆవతలకు గిరవాటెయ్యా లన్నంత కసి పుట్టుకొస్తుంది. కొందర్ని చూస్తే ఛప్పున ఆప్యాయత పుట్టుకొచ్చేస్తుంది; కొందర్ని చూస్తే బలిని పాతాళంలోకి తొక్కేసినట్టు తొక్కెయ్యాలనిపిస్తుంది — ఎందుకో మరి!

లక్ష్మిలో తనని ఏడిపించే అంశమేవిఁటో?

రంగా?

మాటలా?

కులమా?

ఏమో! సరిగ్గా అతనికే తెలీదు.

ఏ క్షణంలో ఆమె కనిపించినా ఏడిపించడమే శర్మ ధ్యేయం.

ఒకనాడు లంచ్ అవర్లో రాజు వచ్చాడు.

"అలంకార్‌లో మంచి పిక్చరొచ్చింది. వస్తా వేవిఁట్రా శర్మా!" అన్నాడు.

"ఏం పిక్చరేం?"

"ఏదో హాలీవుడ్ సరుకు. హీరోయిన్ నీగ్రో నవలామణి."

"అయితే నేను రాలేను."

"ఏవోఁ?"

"ఆ నలుపు న్నేను భరించలేను."

'అదేం? రోజూ చూస్తున్న నలుపే నీకు అలవాటు కాదంటే—" అన్నాడు రాజు, లక్ష్మి వేపు ఓరగా చూస్తూ.

'అందుకే ఛస్తున్నా: ఈ పీడా ఎప్పుడువొదిలి పోతుందని' అన్నాడు శర్మ, ఈ సారి లక్ష్మివేపు సూటిగా చూస్తూనే!

లక్ష్మి తలొంచుకుంది. ఏడు స్తుందిలా వుంది. ఏడవాలి ఇంకా యేడవాలి. అలా ఏడుస్తేనే తన కసి తీరుతుంది.

మరో రోజున శర్మ ఆఫీసుకి ఓ దినపత్రిక తీసుకొచ్చాడు. అతని చుట్టూ బృందం చేరింది, విశేషా లేవిట్రోయ్ అంటూ!

'మిస్ ఆఫ్రికా బొమ్మ పడింది: చూడండహెూ!' అని పేపరెత్తి నీగ్రో అమ్మాయి ఫొటో చూపిస్తూ దండోరా వేశాడు

'అప్సరసలా వుందోయ్' మూర్తి కాంప్లిమెంట్.

'మన ఆఫీసు అప్సరసలకన్నా అందంగానే వుంది' అని శర్మ విరగబడి నవ్వాడు.

అందరి దృష్టి లక్ష్మిమీాదపడింది. వాళ్ళంతా లేవిడీ చేసేట్టు నవ్వుతూ ఉంటే, శర్మ హృదయంలో వీణ మోగింది.

వాళ్ళంతా కలసి తననే యేడిపిస్తున్నారని తెలిసినా లక్ష్మి పల్లెత్తు మాట నేది కాదు ఆఫీసర్‌కి రిపోర్టు చేస్తేబావుం డేది అనిపించేది శర్మకు.

ఆ అమ్మాయిరంగు సింహ స్వప్న మయింది శర్మకు. ఇంట్లో మసి బొగ్గుల్ని చూస్తే చాలు, పొయ్యిలో



'మా ఆవిడ నేను తాగిందీ లేనిదీ వెంటనే కని పెట్టేస్తుం దోయ్!'

'ఎలా?'

'ఎప్పుంటి తలుపు తియ్యడం ఆలస్యం, వొళ్ళు చిట్లగొట్టేస్తా నంటూనట'

---

వేసేసేవాడు. ఓసారి నల్ల పెన్ రాయనని మారాం చేస్తే హుస్సేన్ సాగర్‌లో విసిరేశాడు. ఆఖరికి ఆఫీసుమీద నల్లని రెక్సిన్ క్లాత్ వుందని దాని ముఖమే చూడటం మానేశాడు.

సాయంకాలం ఇంటికి వెళ్ళేసరికి పని మనిషి నల్ల చీరతో ప్రత్యక్ష మయింది. ఆమెను ఛడామడా తిట్టేసి సినిమాకి వెళ్ళిపోయాడు.

హాల్లో మహా ఇబ్బందిగా కూచున్నాడు. తెరమీాద స్లైడ్స్‌లో ఛార్మినార్ కాల్చమని ప్రతిమాలు

తున్న అమ్మాయి నల్ల బ్లౌజ్ వేసుకుంది. హెర్క్యులెస్ సైకిల్ తొక్కే పడతి నల్ల కుడ్తా తొడుక్కుంది. లైట్లురాక హాలంతా నల్లగా చీకటి మయమై పోయింది.

నలుపు భరించరాని దయింది: గట్టిగా అరవాలనుకున్నాడు.

వెనకనించి వీణానాదం లాంటి కంఠస్వరం వినిపించింది. వెనక్కి తిరగాలనుకుంటూనే తిరగలేక పోయాడు. వీణానాదం తెలుగులోని అచ్చుల్నీ, హల్లుల్నీ, ద్విత్వాక్షరాలనీ, మధ్యే మధ్యే గుణత్రిక సంధుల్ని వల్లిస్తోంది. ఆ మంజుల స్వరంతోబాటు మరో మగ గొంతు!

ఊపిరి బిగబట్టి ఆ స్వరాలని విన్నాడు!

మైగాడ్! ఈ జీడిగింజ ఇక్కడ కూడా తయారయిందా! స్వర్గానికి పోయినా సవతిపోరు తప్పనట్టు— ఈ తద్దినం యిక్కడా తగలాలా? ఆ పక్కన కూచున్న పురుష పుంగవు డెవడబ్బా! ఆ తారు దబ్బాకు పెళ్ళయినట్టు లేదు. మరి మగరాయు డెవడు? ప్రేమికుడా? అన్నా, తమ్ముడూ అయితే అంత కేరింతాలు కొడుతుందా? ఇంటర్వెల్లో లైటు వెలగ్గానే తనను చూసి షాక్ తింటుందా? లేక వాడితో చెప్పి తన్నిస్తుందేమో!

తన్నుల తలంపు రాగానే ఛప్పున లేచిపోయాడు భయం వేసి. అంతలో ఇంటర్వెల్ అయి గప్పున లైట్లు వెలిగాయి.

వెనకనించి ఓ పరిచిత కంఠం "ఒరే! శర్మా!" అని పిలిచింది

వెనక్కి చూశాడు. సరసుగాడు. జీడిగింజ పీడికి ఎలా తగిలి దబ్బా!

---

**ఊరందరిది ఒకదారి; ఉలిపికట్టె దొకదారి**




ఇక్కడ అయిదు పిల్లులు వున్నాయి. వీటిలో ఉలిపికట్టె ఏదో చెప్పుకోండి.

(జవాబు 36 వ పేజీలో)

అని చుట్టూ చూశాడు. ఎక్కడా కనిపించలేదు. నరసుగాడూ, ఒక పారిజాతంమాత్రం వున్నారు.

నరసు పారిజాతాన్ని పరిచయం చేశాడు: తన శ్రీమతిగాటూ. ఆవిడ నమస్తే అంది. కళ్ళు మూసుకున్నాడు శర్మ! ఆమె ఏదో అంటోంది: కంఠస్వరం అచ్చు ఆ నల్లపిల్లదే! కాని రూపం దేవకన్య! ఎంత పొరపడ్డాడు! ఒకే రకం కంఠస్వరాన్ని రెండు విభిన్న స్వరూపాలకు ప్రసాదించిన సృష్టిశక్తిని కసిదీరా తిట్టుకున్నాడు!

ఇంటర్వెల్ తర్వాత శర్మ నరసు పక్కనే కూచున్నాడు. ఆమె గలగలా మాటాడుతోంది చీకట్లో — ఆ మాటలు లక్ష్మి మాట్లాడుతున్నట్టే భ్రమ!

మర్నాడు ఆఫీసుకి వెళ్ళి వెళ్ళగానే లక్ష్మి వేపు చిత్రంగా చూశాడు.

నరసు భార్యలా వూహించుకున్నాడు

తెల్లని వాయిల్ చీర భుజాల మీద నిండుగా కప్పుకుని రాసుకుంటోంది లక్ష్మి! ఆ పైట లోపల ఎర్రని బ్లౌజ్! దాన్నెందుకామె పైటతో పూర్తిగా కప్పుకున్నట్టు?

ఎప్పుడూ ఆమె ముదురు ఎరుపు జాకెట్‌నే ఎందుకు వాడుతుంది? ఆ రంగుని ఎందుకు తెల్లని చీరతో కప్పుకోవడం? హృదయంలోని భావాలని కప్పేసుకోవాలనే తాపత్రయమా? భావాలు వుంటే గింటే అవి ఎలాంటివై యుంటాయి? ఆ బ్లౌజు రంగులా కర్కశత్వాన్ని సూచించే కరకు భావాలా? అసలు ఆ భావాల స్వరూపం ఏమిటో?

ఆవాళంతా లక్ష్మి శర్మతో మాట్లాడలేదు. అప్పుడప్పుడు కళ్లెత్తి జాలిగా చూసేది. ఏమన్నా ఇన్ఫర్మేషన్ కావాలేమో? పాపం! నిన్నిచ్చిన వార్నింగ్‌తో భయపడి అడగలేక పోతోందేమో?

లంచ్ అవర్లో బయటకు వెళ్ళి తిరిగొచ్చాక, లక్ష్మి శర్మ సీటు దగ్గర నిలబడి లెడ్జర్ తీసుకుని ఏదో రాసుకుంటోంది.

"పాపం!" అని జాలిపడ్డాడు శర్మ!

తనంటే లక్ష్మి నిజంగా భయపడి పోతోంది. దూరంగా నిలబడి ఆమె వేపు సాలోచనగా చూశాడు. ముఖం ఎంత అమాయకంగా ఉంది! సిల్హౌటీలో మాంచి ఫొటోజెనిక్ ఫేస్ లక్ష్మిది! ముక్కు కొనదేరి అందంగానే ఉంటుంది.

మెల్లగా వచ్చాడు.

ఆమె తప్పు చేసిందాన్లా లెడ్జర్ మూసేసి తన సీట్లోకి వెళ్ళి కూచుంది.

"ఏం కావాలో చెప్పు లక్ష్మీ, చేస్తాను" అనాలనుకున్నాడు. మాటలు పెగల్లేదు.

ఆలోచిస్తూ కూలబడ్డాడు. పెద

వుల మధ్య పెన్ తిప్పుకుంటూ, తలొంచుకుని ఫైల్స్ చూసుకుంటున్న లక్ష్మిని పరిశీలిస్తూ వుండిపోయాడు. కడుపులో ఎవరో చెయ్యిపెట్టి దేవినట్టు జాలీ, బాధా కలిగాయి శర్మకు.

ఈ లక్ష్మి తనని వ్యక్తిగతంగా ఎప్పుడూ బాధించలేదు. కనీసం దురుసుగా నన్నా మాట్లాడదు. ఆఫీసులో కూడా ముభావంగానే ఉంటుంది. సాంబాబుగాడూ, రాజుగాడూ నల్లరంగు మీద వ్యాఖ్యానాలు చేసినపుడు, తలొంచుకొని తన పనేదో తాను చేసుకుంటుంది గాని, తలెత్తి వాళ్ళను కనీసం కళ్ళతోనైనా వారించదు.

నైలాన్ చీర మీద ఓసారి రాజుగాడు విట్టువిసిరేస్తే శారద ఖబడ్దార్ అంటూ జాతీయ భాషలో, అంతర్జాతీయ భాషలో వంద వార్నింగ్ లిచ్చింది. కాని ఈ లక్ష్మి ఆ మాటలు తననే అంటున్నట్టు గ్రహించి కూడా పల్లెత్తు మాటన దెందుచేతనో !

పాపం! లక్ష్మి ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో బాధపడుతున్నట్టుంది. శారదా, నీలవేణీ, వైదేహీ ఆమెతో అంటీ అంటనట్టు తిరుగుతారు. ఇక ఎదురుగా వున్న తను—ఆమె మీద మాట విసరని క్షణంలేదు.

చిన్నతనంలో తను, తనింట్లో వుండే వారాలబ్బాయిని ఇలానే మాటలతో తూట్లు పొడిచేసేవాడు. స్కూల్లో జగ్గారావుని రాళ్ళుచ్చుకుని కొట్టి ఏడిపించేవాడు. బలహీనుల్ని హింసించాలనే తత్వం తన నరనరాల్లోనూ జీర్ణించుకు పోయిందా? ఆ హింసను లక్ష్మి ఎందుకు భరిస్తున్నట్టు? ఆమె మౌనవల్లే తనింకా రెచ్చిపోతున్నాడా?

ఆ మర్నాడు కూడా లక్ష్మి ఇన్ఫర్మేషన్ కోసం శర్మ దగ్గరకు రాలేదు. ఆ మర్నాడే కాదు, వారం దినాలూ తను సీట్లో లేనపుడు చూసి, లెడ్జర్ తీసుకొని తనకి కావల్సింది ఎండార్స్ చేసుకునేది.

శర్మ మనస్సులో ఓ మూలగా గోల ప్రారంభమయింది: లక్ష్మి ఈ మౌనంతోనే తన మీద ప్రతీకారం తీసుకుంటుందేమోనని. తనతో మాటాడకుండా తన పని తాను చేసుకొంటూ ఏమిటి సాధిద్దామని?

“కోపమా లక్ష్మి?” అని లక్షసార్లు అడగాలనుకున్నాడు. అనలేక తన పని మానేసి, ఆమె కేపు ఓర చూపు చూస్తూ వుండిపోయేవాడు.

ఒకసారైనా చూస్తుందేమో తలెత్తి, చిరునవ్వు ఒకటి నవ్వుదామనుకునేవాడు. కాని ఆమె రెండు, మూడు సార్లు కనురెప్ప లెత్తిందే గాని లిప్తపాటులో తల దించేసుకునేది. అది బాధో, నిర్లక్ష్యమో శర్మకు బోధపళ్ళేదు.

ఒకనాడు లంచ్ అవర్లో శర్మ కాఫీ పుచ్చుకొని తొందరగా

సీట్లోకి వచ్చేశాడు. లక్ష్మి టేబుల్ మీద తల వాల్చుకుని కళ్ళు మూసుకుని వుంది. మెల్లగా చెప్పుల చప్పుడు చేశాడు. ఆమె వులిక్కిపడి తలెత్తిచూసింది. కళ్ళనించి కన్నీళ్ళు కారుతున్నాయి. చప్పున రుమాలుతో అద్దుకుని తల తిప్పుకుంది.

ఆశ్చర్యంగా ఆమెవేపు చూశాడు శర్మ. పలకరించా లనిపించింది ఆమె ఏడుపుకు కారణం తెలుసు కోవా లనిపించింది. నవ్వుకున్నాడు: ఏ మనిషినైతే కనిపిస్తేచాలు కసరు కుంటూ, అనుక్షణం అసహ్యించు కునేవాడో, అదే మనిషి బాధను తెలుసుకోవాలని ఆతృత పడటం వింతే అనిపించింది శర్మకు.

"కాంటీన్‌కి వెళ్ళలేదాండి ?"

పిలుపుతో ఉలిక్కిపడ్డ లక్ష్మి, ఆశ్చర్యాన్నంతనీ ఆ ఒక్క క్షణం లోనే గుండ్రంగా కళ్ళల్లోనే తిప్పేసి తలొంచుకుని, అడ్డంగా తిప్పింది.

"వంట్లో బాగులేదా ?"

తల తిప్పింది.

మళ్ళీ మాటలు కరవయ్యాయి.

ఎర్రని బ్లౌజువేపు చూస్తూ కూచు న్నాడు.

నిష్కారణంగా తనామెను ఏడి పిస్తాడు. ఎంత మనోదార్ఢ్యంగల మనిషైతే మటుకు, ఆ అపహాస్యా లకు ఒకనాడు గాకపోతే ఒక నాడైనా ఏడవదా ? మరీ భరించ



కన్హయ్యా లాల్ కపూర్ ఉర్దూలో వ్యంగ్య కవి. అలనిలో ఒకసారి అతని మిత్రుడు ఘర్షణ పడ్డాడు. కపూర్ అతణ్ణి ఏమీ అన కుండా "మిమ్మల్ని ఒక పెద్దమనిషిగా భావించుకున్నాను" అని మాత్రమే అన్నాడు.

వారి మిత్రుడు 'నేను కూడా మిమ్మల్ని పెద్దమనిషిగానే భావించు కున్నాను' అని అన్నాడు.

అప్పుడు కపూర్ ఇలా అన్నాడు: "మీరు భావించుకున్నది సరైనదే. కానీ నేనే పొరపాటు పడ్డాను.

రాను సమయం వచ్చినప్పుడు ఆమె బరస్టయి ఆఫీసరుకు రిపోర్టుచేస్తే ? అక్కడితో తన బ్రతుక్కాస్తా రెడ్ మార్కుతో ముక్కలై పూరుకుం టుంది ! ఆమె షెడ్యూల్డుకాస్టు ఆఫీ సర్ షెడ్యూల్డుకాస్టు— కులాభిమానం ఆయన చూపించక మానాడా ?

"మీరు లెడ్జర్‌లో ఇన్ఫర్మేషన్ అడగడం మానేశారు ?"

గుటక వేసి వూరుకుంది.

"కోప మొచ్చిందా ?"

తల అడ్డంగా తిప్పింది.

"కోపం ఎప్పుడూ రాదా మీకు?"

దీనంగా చూసింది. అంకుశం లాంటి అమాయకపు చూపులు.

మెల్లగా ధైర్యం చేసి, క్షణం పోయాక అన్నాడు :

"మిమ్మల్ని అస్తమానం ఏడిపిస్తూ వుటాను ఎందు కలా యేడిపించా లనిపిస్తోందో నాకే తెలీదు."

ఆమె పెదవులు వణికాయి. మనస్సులో గాయం రేగినట్టు కళ్ళు దీనంగా మూసుకుంది.

శర్మ సందేహానికి ఆమె దగ్గర్నుంచి రెండ్రోజులకుగాని సమాధానం రాలేదు.

"బహుశః నన్ను చూస్తే అందరికీ అలానే అనిపిస్తుందేమో !" అంది.

గతుక్కుమన్న శర్మ ఓ క్షణం తర్వాత భయంగా — "ఏమో ?" అన్నాడు.

"నా దురదృష్టం" అంది లక్ష్మి క్లుప్తంగా.

"మీ రేం దురదృష్టం చేసుకున్నారు ?"

"దేవుడికి తెలియాలి."

ఆమె సన్నగా కన్నీళ్ళు తిప్పుకున్నట్టు గ్రహించాడు.

ఆ మర్నాడూ, ఆ తర్వాతా ఆమె తనకు కాన్లై శర్మతో ఏమీ మాట్లాడ లేదు. లెడ్జర్స్ కూడా అతను లేవ నవుడే తీసుకుని వలిసిందిరాను కునేది.

శర్మకు మనస్సు చివుక్కుమంది. కావాలని అతను మాట్లాడించినా ఆమె ఎందుకంత పెడసరంగా వుందో అర్థం కాలేదు. తను అసహ్యించుకునే దినాల్లో ఆమె ఏదో వంకతో అస్తమానం ప్రాణం తీసేది. ఇప్పుడు మాటాడుతుంటే బెట్టు చూపిస్తోంది.

ఎందుకో ఆ బెట్టు ? దేని ని చూసుకుని ? చదువా ? ఎలాగో పి యూ సీ గట్టెక్కింది. సంస్కారమా — తండ్రి చెప్పులు కుట్టుకునే వాడు. అందమా — వర్ణించసలవి కానిది. ఎందుకో మరీ మిడిసిపాటు ?

ఆడవాళ్ళకు తరతరాలుగా రక్తంలో జీర్ణించుకు పోయిన అహం అతిశయం ఈవిడా ప్రదర్శిస్తున్నట్టుంది! ఆడది ఎంత వికృతంగా వున్నా, మగాడు మానిని చుట్టూ ప్రదక్షిణం చేస్తాడనే చిన్నచూపు వల్లనే కదా ఈవిడ యింత నిర్లక్ష్యాన్ని ప్రదర్శిస్తోంది!

మళ్ళా శర్మకు సీటు మారిపోవాలనే బాధ హెచ్చవ జొచ్చింది.

ఈసారి ఏమైతే అయిందని ఆఫీసర్ దగ్గరకు వెళ్ళాడు.

"నన్నా సీట్లోనించి మార్చెయ్యండి సార్" అని సవినయంగా ఏడ్చాడు.

కారణం అడిగాడు ఆఫీసర్.

శర్మ తెగించి అబద్ధం చెప్పాడు: ఆమె నైతిక ప్రవర్తన మంచిది కాదన్నాడు. సీటు క్రింద అస్తమానం తన కాళ్ళని నొక్కుతుందన్నాడు. రాసుకుని తిరుగుతుందన్నాడు. ఒకసారి తనింటికి రమ్మనమని పిలిచిందని అబద్ధం చెప్పాడు. మనసులోని ద్వేషాన్ని, అసూయనీ, ఆగ్రహాన్ని ముద్దచేసి ఆమెను పుంశ్చలిగా చిత్రించి చెప్పాడు. అన్నీ చెప్పాక ఎందుకో బావురుమని ఏడ్చాడు. ఆ ఏడుపుతో అతని కసిఅంతా వికృత రూపంలో బయటకు వచ్చేసింది.

ఆఫీసర్ అంతా విని అర్థంగాక అతని వేపు చాలాసేపు ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయాడు. అతని చూపు శర్మలో అనుమానాన్ని, భయాన్ని కలిగించింది.

ఆఫీసర్ కాళ్ళ మీద పడిపోయాడు: అతను తననే శిక్షిస్తాడని భయం వల్లనో లేక మనస్సులోని వైకల్యాన్ని ఈ అస్త్రంతో సాధిద్దామనో శర్మకే తెలీదు

ఆఫీసర్ వారించాడు: 'ఏమిటిది- లేవండి' అని తనే లేచిపోయి 'మీ రామెకు 'భయపడి' ఆ సీటు మార్చుకోవాలనుకుంటున్నారా? అయితే ఆమెను అక్కడినించి మార్చేసినా మీకు యిబ్బంది లేదుగా?' అన్నాడు.

'ఎలాగైనాసరే సార్.'

'అయితే మీరు వెళ్ళండి: ఆమె ప్రొద్దుటే ఉద్యోగానికి రాజీనామా యిచ్చింది. రేపటినించి రాదు'

శర్మ నెత్తిన పిడుగు పడ్డట్టు అచేతనుడై పోయాడు. ప్రపంచమంతా ఒక్కసారిగా చీకటైపోయింది. ఒప్పపిచ్చిగా అడుగులేసుకుంటూ సీట్లోకి వచ్చి కూచున్నాడు.

ఎంతసేపటికీ తేరుకోలేకపోయాడు. తలొంచుకుని రాసుకుంటున్న లక్ష్మిని గుచ్చి గుచ్చి చూశాడు. ఎందుకు రాజీనామా చేస్తున్నట్టు? తనకి ఆఫీసు కాకులకూ భయపడా? అలా అయితే రిపోర్ట్ యిచ్చి కండిషనల్ రిజిగ్నేషన్ యివ్వొచ్చుగా?

'మీ...మీరు రిజైన్ చేస్తున్నారా లక్ష్మీ?' అన్నాడు మెల్లగా. ఆమె తలెత్తి చూసి, తలవూపి, తల దించుకుంది.

'ఎందుకు?'

సమాధానం లేదు.

'నా మూలానా?'

లక్ష్మి తలెత్తి వింతగా చూసింది.

'నా వల్ల తప్పేమన్నా వుంటే క్షమించండి' అని లేచి షార్ట్‌లీవ్ తీసుకుని యింటికి వెళ్ళిపోయాడు.

లక్ష్మి మర్నాటి నించి ఆఫీసుకి రావటం మానేసింది.

శర్మకు మొదటి రోజున ఏదో చిరాకు అనిపించింది, మనస్సు దేని మీదికీ లగ్నం చేయలేక

పోయాడు. అస్తమానం తల ఎత్తి ఎదుటి సీటు వేపు పిచ్చిగా చూసే వాడు.

తన కసికి, కోపానికి, ద్వేషానికి, అసూయకూ అలుసుగా కనిపించే మౌన ప్రతిమ యిప్పుడు లేదక్కడ. ఆమెను ఏడిపించి తన హింసా తత్వాన్ని చల్లార్చుకునేవాడు. కాని ఇప్పుడామె లేకపోవడంవల్ల తన లోని క్రౌర్యం శాంతించే అవకాశం లేక మరింత రెచ్చిపోయి కనిపించే ప్రతీవారి మీదా కళ్లు తెంచుకుని పడేది.

ఒకనాడు తమ్ముణ్ణి చావ బాదాడు. మరోనాడు కూర బాగు లేదని తల్లిని కసిరాడు. జీతంనాడు యింట్లో డబ్బు యివ్వలేదు. ఆఫీసులో పని చేసేవాడు కాదు. ఫైల్స్ గుట్టలయ్యాయి. ఆఫీసర్‌చేత తిట్లు తిన్నాడు.

గుండెల్లో వగిలే అగ్ని పర్వతా లని అదుపులో పెట్టుకోవడం తనకి చేతకాదనే నిశ్చయానికి వచ్చేశాడు. ఖాళీగా కనిపించే లక్ష్మి కుర్చీ అతన్ని రెచ్చగొట్టి మరింత యేడి పించేది. చెప్పుకోలేని బాధ చల్లా రని ఆవేశం. వెర్రివాడిలా చూపులు. సరిగ్గా గుడ్డలు వేసుకునేవాడు కాడు. గడ్డం చేసుకునేవాడు కాదు. లంచ్ అవర్లో కాంటీన్‌కి వెళ్ళకుండా సీట్లో కూచుని కసిదీరా ఏడ్చుకునే వాడు.

ఎదుటి సీట్లో వున్నంతకాలం లక్ష్మి మౌనంగానే తనని యేడి పించింది. రాజీనామా యిచ్చి, మాయమైపోయి కూడా ఏడిపిస్తూనే వుంది. ఆమెను చూడాలి! ఒక్క సారి మాట్లాడాలి. ఆమె తనని క్షమించిందంటే చాలు తను కోలు కుంటాడు.

ఆమె ఎక్కడుందో ఈ మహా నగరంలో కనుక్కోవడ మెలా? ఎవర్ని అడగాలనుకున్నా యింకా తనని విడిచిపెట్టని అహం, సిగ్గు మధ్యకొచ్చి విరగబడి నవ్వు తున్నాయి.

ఒకనాడు ఊరంతా తిరిగాడు. సినిమాల దగ్గర నిలబడ్డాడు. నల్లగా కనిపించే ప్రతి స్త్రీని ఆత్రంగా చూశాడు.

రెండు మూడు దినాలు యింటికి రాకుండా హైదరాబాద్, సికింద్రా బాద్ నగరాల వీధుల్ని, వాడల్ని శల్యపరీక్షలు చేసిచేసి లాభంలేక టేంక్ బండ్ మీద కూచున్నాడు. ఓడిపోయా ననుకున్నాడు. ఒక అడుగు ముందుకి వేస్తే నీట్లో పడి పోవచ్చు. ఈతరాదుగా బట్టి మూడు నిమిషాల్లో చచ్చిపోతాడు.

కాని చావడమెందుకు? లక్ష్మి కనిపించనంతలో ఎందుకు తనకి చావాలనే ధ్యాస కలిగింది? తనెవరు? లక్ష్మి ఎవరు?

ఏదో పెళ్ళి వూరేగింపు వస్తోంది. ఛప్పున వెనక్కి చూశాడు. లక్ష్మికి

గాని పెళ్ళి అవుతోందా ? గుండె ఆగినంత పనయింది !

ఊరేగింపు దగ్గర పడింది. కార్లో వరుడు కూచుని వున్నాడు. మెడలో పూల దండలు. ముందు బ్యాండ్ వాయిద్యాలు పదిమంది మనుషులు. పేదవాడి పెళ్ళిలా వుంది.

పెళ్ళికొడుకుని చూశాడు. చాలా వికృతంగా వున్నాడు. గ్యాస్ లైట్ల వెలుతుర్లో అతని కళ్ళు, పళ్ళు మాత్రమే కనిపిస్తున్నాయి. వెనకాల నడిచే మనుషులు—దాదాపు అంతా నల్లగానే వున్నారు.

నలుపు యిప్పుడతనికి ద్వేష కారణం కాలేదు. కాని వరుని రంగే అతనికి కోపాన్ని కలిగించింది. ఇలాంటి వికృతాకారుడు లక్ష్మికి భర్తా ! నో ! వీల్లేదు. ఛప్పున లేచాడు.

ఎవరో నవ్వినట్టు అయింది. లక్ష్మి ఎవర్ని చేసుకుంటే తనకేం ? ఆ వరుడు ఎంత వికారంగా వుంటే అంతగా తనకి లక్ష్మి మీద వుండే ద్వేషం, కోపం తీరుతాయిగా !

వీల్లేదు. అలా కాకూడదు.

లక్ష్మిని తను ద్వేషిస్తున్నాడా ? ప్రేమిస్తున్నాడా ?

తెలీదు ? తెలుసు !

లక్ష్మిని తను ప్రేమిస్తున్నాడు : అందుకే ద్వేషిస్తున్నాడు. ద్వేషం నించి ప్రేమ పుట్టలేదు. ప్రేమలో నించే ద్వేషం పుట్టింది.

ఏనాటమీ ప్రకారం చూస్తే లక్ష్మి అవయవాల పొందిక ఏ శిల్ప, రస కుంటుంది ? సిల్హౌటీగా లక్ష్మి శరీరం ఎంత ఆకర్షణీయంగా వుంటుంది ? కాని, ఆ రంగు ద్వేష కారణ మయింది. తను మనస్సులో ఊహించుకునే లక్ష్మికి, కనిపించే లక్ష్మికి ఎక్కడా సమన్వయం కుదరదు. తన వూహాల లక్ష్మిలా, ఈ లక్ష్మి కనిపించదనే, ఈ లక్ష్మిని తను ద్వేషించేది. కాని ఇప్పుడు రెండింటికీ భేదం లేదు. తనకు లక్ష్మి కావాలి.

అంతలో ఆఫీసులో పనిచేసే ఫ్యూన్ రంగయ్య ఎదురుపడ్డాడు. వాడే పలకరించాడు : "మూడు రోజులనించి ఆఫీసుకి రావడంలేదేం సార్ ?" అన్నాడు.

వాడికి సమాధానం చెప్పలేదు "రంగయ్యా ! మన ఆఫీసులో పని చేసే లక్ష్మిగారి యిల్లెక్కడ—నీకు తెలుసా ?" అని అడిగాడు.

"ఇల్లయితే తెలీదుగానీ చిక్కడ్‌పల్లిలో ఎక్కడో వుండాలి సార్" అన్నాడు రంగయ్య.

తక్షణ పరిగెత్తాడు. టాక్సీలు దొరకలేదు బస్సుల్లో స్థలం లేదు. రిక్షా కట్టించుకుని బయలుదేరాడు.

ఎక్కడని వెతకడం ? రాత్రి పన్నెండింటి వరకూ వెతుకుతూనే వున్నాడు. ఇక లాభంలేక హిమాయత్‌నగర్ రోడ్డు పట్టాడు.

కబ్బు పెళల అవతల, ఇళ్ళ దగ్గర

ఏదో పెళ్ళి జరుగుతోంది. పెళ్ళి వాయిద్యాలు విని ఆగిపోయాడు. అప్రయత్నంగా కన్నీళ్ళు కారాయి.

"లక్ష్మి యిహ నిన్ను జన్మలో మళ్ళీ కలుసుకోలేనేమో!" అని ఒక చోట కూలబడిపోయాడు!

అలా ఎంత సేపు కూచున్నాడో తెలీదు. ఆకాశంలో చంద్రుడు లేడు. నక్షత్రాలు వొయ్యారంగా వొళ్ళు విరుచుకుంటున్నాయి.

కళ్ళు విప్పాడు. ఎవరో తాగి మైకంలో ఏదో మాట్లాడుకుంటూ పోతున్నారు.

"ఎదవకి ఓ సదుపా, అందవా— ఏ వుందనిరా అణ్ణి పెళ్ళాడుతోంది ?" అన్నాడొకడు.

"ఇంకా నయం ఆడన్నా ఒప్పుకున్నాడు. ఆఫీసులో అది బావనోడితో వుండేదంట. నెల కూడా తప్పిందట. అందుకే అచ్చిగాడు దాని కంత అర్జెంటుగా పెళ్లి జేత్తున్నాడు."

మిగిలిన వాళ్ళు నవ్వులు మొదలెట్టారు.

శర్మ ఛప్పున లేచాడు. బహుశః లక్ష్మిని గురించే వాళ్ళు మాట్లాడుకుంటున్నారేమో! ఛప్పున పెళ్ళి పందిర దగ్గరకు పరుగెత్తాడు.

పందిరిలో పెళ్ళయిపోయింది.

నాలుగైదు రిక్షాలు వున్నాయి. రిక్షాలన్నీ ఆత్రంగా చూశాడు. చివరి రిక్షాలో పెళ్ళికొడుకు కూచుని వున్నాడు.

కొందరాడవాళ్ళు పెళ్లికూతుర్ని తీసుకొచ్చారు. రిక్షా ఎక్కించారు. పెళ్ళికూతురు వరుని పక్కన కూచుంది.

శర్మ కళ్ళు బైర్లు గమ్మాయి. వెనక్కి అడుగు వేసుకుంటూ వెళ్ళి ఒక రాటను ఢీకొని కిందపడి పోయాడు "లక్ష్మి!" అని నిశ్శబ్దంగా ఏడ్చాడు.

అరుంధతీ నక్షత్రం మేఘాల చాటుకి వెళ్ళిపోయింది.

రిక్షాలు కదిలిపోయాయి మెల్లగా.

***

ఊరందరిది ఒకదారి; ఉలిపికట్టె దొకదారి [జవాబు]

మూడవ పిల్లి ఉలిపికట్టె. ఒకటోది, నాల్గోది ఒక రకంగానే వున్నాయి. జాగ్రత్తగా చూస్తే రెండోది, అయిదోది ఒక రకమే. మూడోదానికే జోడు లేదు.

# మూడో తరగతి హాస్యం




నవ్వులారావు

కొంతమంది ఎప్పుడు చూసినా గంభీరంగా, మౌనంగా వుంటారు. పదిమందీ సరదాగా కూర్చుని జోక్స్‌మీద జోక్స్ వేసుకుని నవ్వుతూ, తుళ్ళుతూ, పేలుతూ వున్నాసరే, వాళ్ళు మాత్రం అవాళే వాళ్ళింట్లో ఎవరో పోయినట్టు దిగులుగా, బాధగా కూర్చుంటారు.

వాళ్ళకి సరదాగా, హాస్యంగా మాట్లాడాలని, తమ మాటలకి అంతా విరగబడి నవ్వాలని వుండదని కాదు. ఉంటుంది. కాని, వాళ్ళకి హాస్యంగా, చమత్కారంగా మాట్లాడ్డం తెలీదు. సమయానికి వొక్క విట్టూ జ్ఞాపకం రాదు. మనం పది మాటలు మాట్లాడితే గాని, వాళ్ళని వొక్క మాటలోకి దిరిగించలేము.

హాస్యంగా మాట్లాడ్డం, హాస్యంగా రాయడం ప్రత్యేక కళలు. కొందరికి అవి పుట్టుకతోనే వస్తాయి.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందంటారు. కొందరు పుడుతూనే నవ్వుతూ పుడతారు. వీళ్ళే పెద్దలయ్యేది. లేకపోతే హాస్య నటులవుతారు. రేలంగి పుట్టగానే నవ్వాట్ట. అతని నవ్వు చూసి చుట్టుపక్కలవాళ్ళు కూడా నవ్వారట. అప్పుడే ఎవరో జ్యోతిష్కుడు చెప్పాట్ట ఇతడు గొప్ప కామెడియన్ అవుతాడని. ఈ కథ ఎవరో కల్పించినదని గిట్టని వాళ్ళు చెబుతారు.

మరికొందరు కష్టపడి హాస్యం నేర్చుకుంటారు.

నా జోకెలా ఉంది సార్!



ఇంకా కొందరు తాము గొప్ప జోకేశ్వరరావులమని అపోహపడి తమనిట్లుకుతాామే నవ్వేస్తూవుంటారు. వాళ్ళ నవ్వు, వాళ్ళ పిట్లు జాలి కలిగిస్తాయి

హాస్యంలో కూడా చాలా రకాలున్నాయి నిజంగా ఒకటో రకం హాస్యం మాట్లాడేవారు కొందరు మహానుభావు లుంటారు. ఈ మధ్య 'జ్యోతి'లో కొందరు హాస్య రచయితలని పరిచయం చేస్తున్నారు చూడండి. వాళ్ళూ ఒకటో రకం వాళ్ళు.



రెండో రకం వాళ్ళని వదిలేస్తే మూడో తరగతి జోకారావులని గురించే ఇప్పుడు నేను ముచ్చటించబోయేది

మూడో తరగతి హాస్యాన్ని సృష్టించడం పెద్ద కష్టమేమీ కాదు. కొంచెం కష్టపడి, ముందే కొన్ని ఆలోచించి పెట్టుకుని, సమయానుకూలంగా ఉపయోగిస్తుంటే హాస్యభాషిగానో, హాస్య రచయితగానో చెలామణి కావచ్చు

ఈ మూడోరకం హాస్యంలో ఒక పద్ధతి ఇంగ్లీషూ తెలుగూ కలిపి, తెలుగును ఇంగ్లీషులో, ఇంగ్లీషును తెలుగులో మాట్లాడ్డం.

దీనికి ఉదాహరణలు భమిడిపాటి కామేశ్వరరావుగారి రచనల్లో కనిపిస్తాయి

"ఐ విల్ రెట్ కిరసనాయిల్ టు యువర్ హెడ్ ఎండ్ దెన్ సెట్ ఫైర్ టు" అని ఒక పాత్ర చేత అనిపిస్తారు భమిడిపాటి వారు.

"యూ హౌ మచ్ అంటే యూ హౌ మచ్" (నువ్వెంతంటే నువ్వెంత?) అనేది ఇంకో ఉదాహరణ.

వేళా పాళా, హద్దూ పద్దూ శ్రుతి మితి ఎరిగి ప్రయోగిస్తే ఈ హాస్యం కొన్నిసార్లు రాణిస్తుంది

ఒకసారి నా స్నేహితుడొకడిని "ఏమోయ్, ఆఫీసు కెడుతున్నావా?" అని అడిగాను.

"ఫర్ హూమ్, యాజిఫ్ డెడ్" అన్నాడు.

నా కర్థం కాలేదు. తరవాత చెప్పాడు దాని అర్థం — "ఎవడి కోసం చచ్చినట్టు" అట.

స్కూలు కుర్రాళ్ళు ఇలాగే తెలుగు మాటల్ని తర్జుమా చేసి ఆనందిస్తుంటారు

'గార్డెన్ టు కమ్' అంటే తోట కూర.

'టెంపుల్ షిప్' – గుడివాడ.

'డంబ్ మైండ్స్' చూశావా? అంటే 'మూగమనసులు చూశావా?'

'పోనీ హనీమైండ్స్?' (తేనె మనసులు)

హైస్కూళ్ళు కుర్రాళ్ళు తమ మిత్రుల పేర్లను కూడా ఇంగ్లీషు చేసి తికమక పెడుతూ వుంటారు. విశ్వం అనే కుర్రాడు 'మిస్టర్ యూనివర్స్' అవుతాడు. కుటుంబరావు 'ఫ్యామిలీరావు'గా, నరసింహం 'మ్యాన్ లయన్'గా, వరదాచార్లు 'బూన్ గివింగ్ సూప్స్'గా, పూర్ణచంద్రరావు 'ఫుల్ మూన్ రావు'గా మారిపోతారు. ఇదీ తమాషాగానే వుంటుంది మరీ శ్రుతి మించకుండా వుంటే.

'ఆంధ్రా పేపరుంటే ఇస్తావా?' అంటే 'ఆంధ్ర పత్రిక ఇస్తావా?' అని అర్థం.

'నీ దగ్గిర లైటుందా?' అంటే 'నీ దగ్గిర జ్యోతి వుందా?' అని.

నాకు తెలిసిన నాయనకి తెలిసిన నాయన ఒకాయన వున్నాడు. ఆయన ఇంగ్లీషు, దాని వెంటనే దాని తెలుగు తర్జుమా గబగబ




మాట్లాడి నవ్వు పుట్టిస్తాడు ఆయన మాటల్ని కొన్నిటిని ఉదహరిస్తాను:

'వేరార్యు గోయింగెక్కడికి వెడుతున్నావ్?'

'వాటార్యు డూయింగేం చేస్తున్నావ్?'

'హౌ యీజ్ యువర్ ఫాదర్మీ ఫాదరెలా వున్నాడోయ్?'

'ఐ యామ్ నాడ్డూయింగ్వెల్వొంట్లో బాలేదోయ్.'

'మై వైఫ్ ఈజౌట్సైడ్ మా ఆవిడ వెలపటుంది.'

ఇది మూడో తరగతి హాస్యమని మొదటే మనవి చేశాను. అయితే దీన్ని నేను మొట్టమొదటే మన్ని

చేశానే — సరదాగా మాట్లాడాలని వుంది, ఏ వొక్క విట్టూ జ్ఞాపకం రాక, చేతకాక దిగులుగా కూర్చునే వాళ్ళు చాలామంది వుంటారు— వాళ్ళకి పనికొస్తుంది. వాళ్ళు ముందు ఇలాంటి చవటబారు సంభాషణతో మొదలెట్టాలి. దాంతో కాస్త నోరు విప్పి చలాకీగా మాట్లాడ్డం అలవాటవుతుంది. తరవాత తరవాత నెమ్మదిగా హాస్య సంభాషణ దానంతటదే పట్టుబడ వచ్చు. ఎంత తెలివి గలవాళ్ళయినా అక్షరాభ్యాసం కాగానే బి. ఏ. పరీక్షకు కూర్చోరుగా? నెమ్మదిగా దారిలోకొస్తారు. అదీ నా పాయింటు.

అయితే, ఈ రకం హాస్యాన్ని — మరీ మూడో తరగతికి చెందింది కదండీ! కొంచెం మోతాదు తెలిసి వాడాలి. లేకపోతే 'ద విల్ బోరదర్స్' ఇతర్లకి విసుగు పుట్టిస్తారు. ఇప్పుడు నేను రాసిందంతా ఈ మూడోరకం హాస్యం కోసం ప్రయత్నమే కనక, మీకు బోరు కొట్టక ముందే ఐటిల్ ఫినిషింతటితో ముగిస్తాను.

***

---

# "జ్యోతి"లో * త్వరలో

సుప్రసిద్ధ నవలా రచయిత్రి
శ్రీమతి
**ద్వివేదుల విశాలాక్షి**
రచించిన
కొత్త సీరియల్



కళ్ళు తెరుచుకుని తుమ్మడం కష్టం.

*

రేడాన్ అనేది ఒక రకమైన వాయువు (గ్యాస్). అయినా, అది ఇనుముకంటె నాలుగు రెట్లు బరువు.

*

10, 989 అనే అంకెని 9 పెట్టి హెచ్చవేయడానికి తేలిక మార్గం — ఆ అంకెని తిరగెయ్యండి.

*

తేనెటీగలవల్ల దాదాపు లక్ష రకాల మొక్కలు పళ్ళు కాస్తున్నాయి.

*

ఒక తపాలా బిళ్ళ అంతమేర మానవచర్మాన్ని పరిశోధిస్తే — 30 లక్షల రక్తకణాలు, ఒక గజం పొడుగు రక్తనాళాలు, నాలుగు గజాల నరాలు ఒక వంద స్వేదగ్రంథులు, పదిహేను తైలగ్రంథులు, పాతిక నరాల చివర్లు వుంటాయి.

*

ఆస్ట్రేలియాలో 'కంగారూ' అనే వింతజంతువు ఉంది. ఆ మాటకి అర్థం 'నువ్వు చెప్పేదేమిటో తెలియడంలేదు' అని. ఒక ఇంగ్లీషు వాడు ఆస్ట్రేలియాలోని ఆదిమవాసిని 'అదేం జంతువు?' అని ప్రశ్నించాడట. ఆదిమవాసికి ఆ ప్రశ్న అర్థంకాక 'కంగారూ' అన్నాట్ట.

ఇంగ్లీషువాడు ఆ జంతువుపేరే 'కంగారూ' అనుకున్నాట్ట. ఆ పేరు అలాగే స్థిరపడిపోయింది. అవతలివాడు చెప్పేదేమిటో బోధపడకపోతే మనం తెలుగులో కూడా ఇలాగే 'కంగారు' పడతాం, చూడండి.

*

1, 11, 11, 111 అనే సంఖ్యని అదే సంఖ్యతో హెచ్చవేస్తే వచ్చేది :- 12345678787654321.

*

మిడతకు అయిదు కళ్ళు.

*

మనం ఏ మాట పలకడానికైనా 72 కండరాలను ఉపయోగిస్తాము.

*

మెగ్నీషియం అనే లోహం కాలి బూడిదైన తరవాత ఎక్కువ తూగుతుంది. దానికంటె దాని బూడిద ఎక్కువ బరువు.

*

ఒక మనిషిని నిరాధారంగా గాలిలోకి లేవనెత్తడానికి 3000 అడుగుల హీలియం వాయువు కావాలి.

*

దూది నీటికంటె ఒకటిన్నర రెట్లు ఎక్కువ బరువు.

*

421, 052, 631, 578, 947, 368 అనే అంకెని మీ రెప్పుడైనా రెట్టింపు చేయవలసివస్తే రెండుపెట్టి హెచ్చవేయ నక్కరలేదు. చివరి అంకెని అక్కడినుంచి తీసేసి మొదట పెట్టండి.

*

సంపూర్ణ సూర్యగ్రహణం ఎప్పుడూ ఏడన్నర నిమిషాలకంటె ఎక్కువసేపు వుండదు.

సేకరణ — "బాబ్జీ"

***

# తీరని వెతలో తీయని గాథలు

సి. ఆనందారామం

[గత సంచిక తరువాయి]

'నన్ను క్షమించండి. వాళ్ళతో మాట్లాడలేను నేను. నాకు ఒంట్లో బాగుండలేదని చెప్పి, వాళ్ళను పంపెయ్యండి.'

"ఛ! ఛ! ఏమిటది పల్లెటూరి పిల్లలా? వాళ్ళంతా నిన్ను ప్రత్యేకం చూట్టానికొచ్చే."

వచ్చినట్టు హాల్లోకొచ్చి అందరికీ నమస్కరించింది సరళ.

"మీ రచనలు చదివానండీ! మిమ్మల్ని కలుసుకో గలిగినందుకు సంతోషం."

"మీరు చక్కగా వ్రాస్తారు."

నాలుగు వైపులనుంచీ వచ్చిన ప్రశంసా వాక్యాలను వినయ పూర్వకంగా చిరునవ్వుతో స్వీకరించింది.

"ఇంత చక్కగా ఎలా వ్రాయగలుగుతారండీ!" ఆశ్చర్యంగా అడిగాడొక పెద్దమనిషి.

సరళకు చాలా విసుగ్గా, చిరాగ్గా ఉంది.

"కాగితం మీద కలంతో వ్రాస్తానండీ!"

"అహ! అది కాదు. ఇంత చక్కగా ఎలా ఆలోచించ గలుగుతారని."

"ఆలోచించడానికి నాకు టైం లేదండీ! వ్రాసేస్తాను."

"ఏమిటీ?"

సరళ సర్దుకుంది.

"అంటే, వ్రాస్తూనే ఆలోచిస్తానని ..."

"మీ లాంటి ప్రతిభాశాలురు మాత్రమే అలా చెయ్యగలరు."

ముఖమెదురుగా పొగడుతుంటే ఏం చెయ్యాలో సరళ కెవరూ చెప్ప లేదు. ఒకసారి "ఇహి" అని చేతిగోళ్ళు శ్రద్ధగా చూసుకుంది.

"ఇటీవలి వారి రచనల్లో మీ కెవరి రచనలంటే ఇష్టం?"

చటుక్కున ఏ పేరూ గుర్తు రాలేదు సరళకి.

"బహుమతు లొచ్చిన వాళ్ళ రచనలు!"

"మీ హాబీ ఏమిటీ?"

సీరియల్

"తీరికుంటేగా హాబీకి! ఎప్పుడూ వ్రాస్తూనే ఉంటాను."

"మీ కార్యక్రమా లన్నింట్లో మీ కేవంటే ఇష్టం?"

"వంట!"

"ఎదంటే ఇష్టం లేదు?"

"ఇంటర్వ్యూలు!"

"వస్తామండి!"

వెళ్ళిపోయారు వాళ్ళు.

వాళ్ళు వెళ్ళీ వెళ్ళగానే సరళ మీద భగ్గుమన్నాడు సుదర్శనం.

"ఛ!ఛ! అంతా తగలబెట్టేశావ్! అలాగేనా మాట్లాడేది? ఎన్నిసార్లు చెప్పినా నీకు బుద్ధిలేదు."

సరళ దీనంగా కూచుంది.

"నిజంగా అంతకంటె మంచి సమాధానాలు నాకు తోచలేదు. మీరు చెప్పండి పోనీ..."

"జీవితాన్ని గురించి ఆలోచించి వ్రాస్తానని చెప్పాలి."

"జీవితాన్ని గురించా? జీవితాన్ని గురించి నాకేం తెలుసు? దేశాటనం చేసి వింతలు గమనించానా? సంఘ సేవకురాలినయి సఘాన్ని చూశానా? కనీసం నా పరిసర వ్యక్తులనయినా అన్ని కోణాలలోంచీ అర్థం చేసుకోవటానికి ప్రయత్నించానా? చివరకు అనుభవజ్ఞుల పుస్తకాలనైనా అన్నీ చదివానా? సంసారం మాని అడవుల్లో ధ్యానంలో మునిగిపోయిన యోగులకు, ప్రలోభాలను జయించి మానవ సేవకే జీవితం అంకితం చేసిన ధీరులకూ, జనులనందరినీ తమ గుప్పిట్లో పెట్టుకొని ఆడించే లోభులకూ అర్థంకాని జీవితం నాకర్థ మౌతుందా?"

"అబ్బబ్బ! నిన్ను జీవితాన్ని అర్థం చేసుకోమని చెప్పటంలేదు. నువ్వేం అర్థం చేసుకున్నావని వాళ్ళడగరు. ఊరికే చెప్పటానికేం?"

"ఊరికే ఎందుకు చెప్పటం?"

"అలా చెప్పాలి గనుక" కసురుకున్నాడు సుదర్శనం.

"సరే! అలాగే చెపుతాను" బెదురుగా ఒప్పుకుంది సరళ.

"నీ కెవరి రచనలంటే ఇష్టమని అడిగినప్పుడు ఎవరైనా ప్రఖ్యాతులైన వాళ్ళ పేర్లు చెప్పాలి గాని "బహుమతులొచ్చిన వాళ్ళ రచనలు" అని చెప్పకూడదు."

"నాకేం తెలుసు? ఆ మధ్య ఒక రచయిత్రుల సమావేశం జరిగింది. అందులో ఒకావిడ తెనుగు నవలా సాహిత్యాన్ని సమీక్షించారు. ఆ సమీక్షలో ఆవిడ చదివిన పేర్లన్నీ బహుమతు లొచ్చినవాళ్ళ పేర్లే! నేను అదే స్టాండర్డుగా తీసుకున్నాను."

"అది మంచిదే! కాని పేర్లు చెప్పాలి."

"సమయానికి గుర్తు రాలేదు. న్యాయానికి కొన్నిసార్లు నాకు పెద్ద పేరులేని రచయితలు వ్రాసిన రచ

వలుకూడా ఎంతో బాగుంటాయి."

"హాబీ ఏమిటంటే సంగీతమనో చిత్రలేఖనమనో, గార్డెనింగ్ అనో ఏదో చెప్పాలి."



"అవేవీ నాకు రావుగా !"

"రాకపోతేనేం ? ఏదో ఒకటి చెప్పటానికి. గార్డెనింగ్ అనెయ్యి తీరిపోతుంది."

"సరే !"

'నీకు ఎక్కువగా ఏదిష్టం ? అంటే - చదవటం అని చెప్పాలి. "వీలయినంతగా విజ్ఞానార్జన చెయ్యటమే నా ఆశయం' అని చెప్పాలి."

"సాధారణంగా మనుష్యుల కంద రికీ ఏది అందుబాటులో ఉండదో అదంటే ఇష్టంగా ఉంటుంది. నాకు అందుకనే వంటంటే ఇష్టం."

"అబ్బబ్బ! నీ ఇష్టం నీమనసులో వుంచుకో! వాళ్ళతో చెప్పేటప్పుడు మాత్రం నే చెప్పినట్లే చెప్పాలి."

'సరే !'

"మీలాంటి వాళ్ళు వస్తూంటే నాకు చాలా సంతోషంగా ఉంటుంది. మీవంటి తెలివైనవారితో

సంభాషణవల్ల నా మనసు వికసిస్తుంది' అని చెప్పాలి. అంతేకాని 'ఛందస్సూత్రాలు ఇష్టం లేదు' అనకూడదు."

"చిన్నప్పుడు మా తెలుగు మాస్టారొక సామెత చెప్పేవారు సంస్కృతంలో! అది గుర్తొస్తోంది."

"ఏమిటది? నాకు సంస్కృతం రాదు."

"తాత్పర్యం చెపుతాను. ఒంటెలకు పెళ్ళిళ్ళయితే గాడిదలొచ్చి పాటలు పాడాయిట! ఆ తరువాత ఒకరినొకరు పొగుడుకున్నాయిట! 'ఆహాహా! ఏమందం అంటే, ఓహోహో ఏం గాత్రం' అని."

నవ్వేయబోయి కోపం తెచ్చుకున్నాడు సుదర్శనం.

"చాల్లే బడాయి. ఇంకముందయినా, నేను చెప్పినట్లు చేస్తావుగా?"

"చేస్తాను."

"సరే! వెళ్ళి వ్రాసుకో!"

## 7

అకస్మాత్తుగా వచ్చాడు రావు. వస్తూనే సంభాషణ ప్రారంభించాడు.

"కాళిదాసు 'అభిజ్ఞాన శాకుంతలం' చాలా బాగా వ్రాశాడు. అందుకని అన్ని రచనలూ అలాగే వుండాలంటే ఎలా వుంటుందీ?"

"నేను నవలలు వ్రాసేమాట నిజమే! ప్రతి నవలా మధ్యలోంచి వ్రాసేమాట నిజమే! అయినా, నీ మాటలు మాత్రం అర్థం చేసుకోలేకపోతున్నాను."

"నువ్వు తిరుగుబాటు ధోరణిలో ఒక నవల రాశావు. బాగుంది. ఇక అదే ధోరణా? ఒకే ధోరణిలో పడితే త్వరలోనే నీరసపడిపోతావు. ఇప్పటికే నువ్వు తీసుకుంటున్న సమస్యలు వన్ సైడెడ్ అయిపోతున్నాయి. ఎవరినో ఉంచుకున్న మొగవాళ్ళుంటే, ఎవరితోనో లేచిపోయిన ఆడవాళ్ళూ ఉన్నారు. భార్యలను [illegible] భర్తలుంటే భర్తలను లక్ష్యపెట్టక ఊరేగే భార్యలూ ఉన్నారు. ఈ సమస్యలు స్త్రీలవి కావు మనుష్యులవి. మనుష్యులకి మనసున్నంత వరకూ బలహీనతలుంటాయి. బలహీనతలున్నంతవరకూ ఇలాంటి సమస్యలుంటాయి. నీ శిల్పాన్ని ఒక పరిధిలో బంధించెయ్యకు. అది చెప్పటానికే వచ్చాను." ఎంత హఠాత్తుగా వచ్చాడో, అంత హడావుడిగా వెళ్ళిపోయాడు రావు.

రావు మాటలు నచ్చాయి సరళకి. ధోరణి మార్చింది.

సరళ నవల చదివి విస్తుపోయాడు సుదర్శనం.

"ఇదేవిటిలా రాశావ్?"

"ఏం? బాగుండలేదా?"

"బాగోగులు కాదు–నువ్వు తిరుగు

వలుకూడా ఎంతో బాగుంటాయి!"

"హాబీ ఏమిటంటే సంగీతమనో చిత్రలేఖనమనో, గర్డెనింగ్ అనో ఏదో చెప్పాలి."



"అవేవీ నాకు రావుగా!"

"రాకపోతేనేం? ఏదో ఒకటి చెప్పటానికి. గార్డెనింగ్ అనెయ్యి తీరిపోతుంది."

"సరే!"

'నీకు ఎక్కువగా ఏదిష్టం? అంటే - చదవటం అని చెప్పాలి. "వీలయినంతగా విజ్ఞానార్జన చెయ్యటమే నా ఆశయం' అని చెప్పాలి."

"సాధారణంగా మనుష్యుల కందరికీ ఏది అందుబాటులో ఉండదో అదంటే ఇష్టంగా ఉంటుంది. నాకు అందుకనే వంటంటే ఇష్టం."

"అబ్బబ్బ! నీ ఇష్టం నీమనసులో వుంచుకో! వాళ్ళతో చెప్పేటప్పుడు మాత్రం నే చెప్పినట్లే చెప్పాలి."

'సరే!"

"మీలాంటి వాళ్ళు వస్తుంటే నాకు చాలా సంతోషంగా ఉంటుంది. మీవంటి తెలివైనవారితో

సంభాషణవల్ల నా మనసు వికసి స్తుంది' అని చెప్పాలి. అంతేకాని 'ఇంటర్వ్యూలు ఇష్టం లేదు' అన కూడదు."

"చిన్నప్పుడు మా తెలుగు మాస్టారొక సామెత చెప్పేవారు సంస్కృతంలో! అది గుర్తొస్తోంది."

"ఏమిటది? నాకు సంస్కృతం రాదు."

"తాత్పర్యం చెపుతాను. ఒంటెలకు పెళ్ళిళ్ళయితే గాడిదలొచ్చి పాటలు పాడాయిట! ఆ తరువాత ఒకదాన్నొకటి పొగుడుకున్నాయిట! 'ఆహాహా! ఏమందం' అంటే, 'ఒహొహొహొ ఏం గాత్రం' అని.

నవ్వేయబోయి కోపం తెచ్చుకున్నాడు సుదర్శనం.

"చాల్లే బడాయి. ఇంకముందయినా, నేను చెప్పినట్లు చేస్తావుగా?"

"చేస్తాను."

"సరే! వెళ్ళి వ్రాసుకో!"

# 7

అకస్మాత్తుగా వచ్చాడు రావు. వస్తూనే సంభాషణ ప్రారంభించాడు.

"కాళిదాసు 'అభిజ్ఞాన శాకుంతలం' చాలా బాగా వ్రాశాడు. అందుకని అన్ని రచనలూ అలాగే వుండాలంటే ఎలా వుంటుందీ?"

"నేను నవలలు వ్రాసేమాట నిజమే! ప్రతి నవలా మధ్యలోంచి వ్రాసేమాట నిజమే! అయినా, మీ మాటలు మాత్రం అర్థం చేసుకోలేక పోతున్నాను."

"నువ్వు ఉరుగుబాటు ధోరణిలో ఒక నవల రాశావు. బాగుంది. ఇక అదే దోరణా? ఒకే ధోరణిలో పడితే త్వరలోనే నీరసపడిపోతావు. ఇప్పటికే నువ్వు తీసుకుంటున్న సమస్యలు వన్ సైడెడ్ అయిపోతున్నాయి. ఎవరినో ఉంచుకున్న మొగవాళ్ళుంటే, ఎవరితోనో లేచిపోయిన ఆడవాళ్ళూ ఉన్నారు. భార్యలను తన్నే భర్తలుంటే భర్తలను లక్ష్యపెట్టక ఊరేగే భార్యలూ ఉన్నారు. ఈ సమస్యలు స్త్రీలవి కావు. మనుష్యులవి. మనుష్యులకి మనసున్నంత వరకూ బలహీనతలుంటాయి. బలహీనతలున్నంతవరకూ ఇలాటి సమస్యలుంటాయి. నీ శిల్పాన్ని ఒక పరిధిలో బంధించెయ్యకు. అది చెప్పటానికేవచ్చాను." ఎంత హఠాత్తుగా వచ్చాడో, అంత హడావుడిగా వెళ్ళిపోయాడు రావు.

రావుమాటలు నచ్చాయి సరళకి. ధోరణి మార్చింది.

సరళ నవల చదివి విస్తుపోయాడు సుదర్శనం.

"ఇదేవిటిలా రాశావ్?"

"ఏం? బాగుండలేదా?"

"బాగోగులుకాదు—నువ్వు తిరుగు

ఈజీచైర్‌లో వాలిపోయిన సుదర్శ నాన్ని చూస్తూ అడిగింది సరళ—

"ఏంలేదు- కొంచెం తలనొప్పిగా ఫీవరిష్‌గా ఉంది. అంతే! కాస్సేపు పడుకుంటే అదే తగ్గిపోతుందిలే, నువ్వు రాసుకో!"

బూట్లయినా విప్పకుండా తన గదిలో కెళ్ళిపోయాడు సుదర్శనం—

సరళ దిగాలు పడిపోయింది.

భర్తకంత భారంగా వుంటే తను వ్రాసుకుంటూ కూర్చోవటమా? వ్రాసుకోగలదా?

ఇది మంచి అవకాశం—తన మనసులో వున్న ప్రేమ సుదర్శనానికి ఇప్పుడు తెలిసిరావాలి, చెప్పేస్తుంది. భయమాశ్చర్యచకితం కాకుండా, అన్నింటికంటె అతనికి సేవ చేయటమే తన కిష్ట మని చెప్పెయ్యాలి.

నెమ్మదిగా వంటింట్లోకి తొంగి చూసింది. థాంక్ గాడ్! కృష్ణవేణి లేదు. తొందరగా స్టౌ అంటించి స్టీలర్‌లో స్ట్రాంగ్ డికాక్షన్ తీసి తను స్వయంగా కాఫీ కలిపి, తృప్తిగా ఆ గ్లాసు చేత్తో పట్టుకుని సుదర్శనం దగ్గిరకు అడుగులు వేసింది.

ఎదురుగా కనిపించిన దృశ్యానికి నిగ్ర్భాంతురాలయిన సరళ చేతి లోంచి కాఫీ గ్లాసు క్రిందకు జారిపోయి, వేడికాఫీ వంటినిండా వలికింది. సుదర్శనం కాఫీ తాగు తుంటే, కృష్ణవేణి నుదుటికి అమృతాంజనం రాస్తోంది.

గబుక్కున లేచాడు సుదర్శనం— త్వరత్వరగా రుమాలతో సరళ కాలి మీద పడిన కాఫీ తుడిచేశాడు.

"నువ్వెందుకొచ్చావ్ సరళా! నీ కెందుకీ పనులన్నీ? కృష్ణ చూసుకుంటుందిగా! నువ్వు రాసుకోక పోయావా?"

"కృష్ణ! కృష్ణ మీకు తలకూడా రాస్తుందా?"

"రాస్తుంది. ఎందుకలా వెల వెల పోతున్నావ్? కృష్ణ సరిగ్గా చేస్తుందో చెయ్యదో, అనా? నీకు తెలీదు సరళా! కృష్ణ చాలా మంచిది. అలాటివాళ్ళు నూటి కొక్కరు కూడా ఉండరు. నీ, నా భేదం లేకుండా అందర్నీ స్వంత వాళ్ళలాగే చూస్తుంది. ఆ విషయంలో నువ్వు దిగులు పడకు వెళ్ళి రాసుకో!"

"రాసుకో సరళక్కా! నాకింత కంటె పడేపాతేముందీ? చదువా, చట్టుబండలా? కాస్సేపు సుదర్శనం బావకి తలరాస్తే నా చేతులరిగి పోవులే! ఈ మాత్రం సాయంకూడా లేకపోతే, దేనికి?"

అక్కడ నుంచోలేక సరళ గిరున తిరిగి తన గదిలో కొచ్చేసింది. మస్తిష్కం పగిలిపోతోంది. సహించ లేదు — ఇది సహించలేదు. దగ్గిర కూర్చుని తల రాయటం కూడా సాధారణ బంధుత్వమని సరిపెట్టుకో లేదు. కన్నీళ్ళతో కాగితం కలం అందుకుంది.

శ్రీపాతకి,

ఎవరైనా కొంతవరకే సహించగలరు. కానీ, శ్రుతిమించి సహించటం కష్టం. నలుగురిలా నేను-భర్త ఆదరానురాగాలతో సుఖంగా గడపాలని ఆశపడ్డాను. ఆ ప్రయత్నం ఎండమావులవెంట ప్రయాణమని తేలిపోయింది. నన్నొక వ్యక్తిగా, ముఖ్యంగా స్త్రీగా గుర్తించని చోట నేనుండటం అసంభవం..."

కన్నీళ్ళు కాగితాన్ని తడిపేస్తుంటే కలం కింద పడేసి పక్కమీద వాలిపోయింది సరళ. ఊహూ! ఉండకూడదు వెళ్ళిపోవాలి, ఎక్కడికైనా వెళ్ళిపోవాలి. ఇంత నికృష్టపు బ్రతుకొద్దు. చకచక బట్టలు సర్దుకుంది. కావలసిన డబ్బు తీసుకుని పర్సులో పెట్టుకుంది. అర్ధరాత్రి ఆడది ఒంటరిగా వెళ్ళటం ప్రమాదం. తెల్లవారు ఝామున వెళ్తే సరి! ఎక్కడి కెళ్ళాలి? ఏం చెయ్యాలి? గడపదాటితే గండాలే ఆడదానికి. అందుకనే గడపలోపలి కష్టాలన్నీ దిగమింగుకో గలుగుతుంది. కానీ, ఈ శూన్యపు బ్రతుకు తనకొద్దు. ఎంత విచారమైనా భరించగలదు. ఈ శూన్యంకంటె అదే నయం...

సరళకు తెలియకుండానే కనురెప్పలు వాలిపోయాయి.

మెలకువ వచ్చేసరికి సుదర్శనం ఆదుర్దాగా మీపైకి వంగి చూస్తున్నాడు—

"ఎలా ఉంది సరళా?"

సరళ లేచే ప్రయత్నం చెయ్యబోయింది. కళ్ళు తిరిగి పడుకుండిపోయింది.

"లేవకు. లేవకు సరళా! నీకు జ్వరంగా ఉంది. లేవలేవు. చూశావా? నా జ్వరంకోసం లంఘన పెట్టుకుని జ్వరం తెచ్చుకున్నావు. నా జ్వరం తగ్గిపోయింది. నీ జ్వరం నిలిచిపోయింది. ఇంత సెన్సిటివ్‌నెస్ పనికిరాదు సరళా!"

నీరసంగా చూసి ఊరుకుంది సరళ. తనకు జ్వరం వచ్చిందా? తనజ్వరానికి లంఘన పెట్టుకోవటం వల్ల జ్వరం వచ్చిందనుకుంటున్నాడు సుదర్శనం.

సరళ జ్వరం దిగజారే వరకూ కంపెనీకి కూడా సెలవుపెట్టి సరళ మంచం ప్రక్కనే ఉండిపోయాడు సుదర్శనం –

అతని ముఖంలో స్పష్టంగా కనిపిస్తున్న ఆందోళనకు, జాలికీ, ప్రేమకూ కరిగిపోయింది సరళ. అతని జ్వరంలో అతనికి సేవచేసి తన ప్రేమ నిరూపించుకో గలిగే అవకాశం లేకపోయింది. కానీ జ్వరం తెచ్చుకుని సుదర్శనానికి తన మీదున్న ప్రేమ అర్థం చేసుకో గల్గింది.

"జ్వరంలో ఉన్నా వ్రాస్తూనే ఉన్నావు కదూ?" బత్తాయి తొనలు వలుస్తూ అడిగాడు సుదర్శనం.

"ఏమిటి?" తెల్లబోయింది సరళ.

"అదే! ఆ ఉత్తరం నేను తిరుగుబాటుధోరణిలో రాయమన్నానని అలా నే ప్రారంభించావు. గుడ్. ఎంత టచింగ్‌గా ఉందో తెలుసునా? నువ్వింత మంచి ఆర్టిస్ట్‌వి గనుక నే నిన్ను మామూలు పనులతో నీ టైమ్ వేస్ట్ చేసుకో వద్దంటాను. పాపం, పూర్తవకుండానే జ్వరం వచ్చేసింది. వర్రీ అవకు. పూర్తి చేద్దువుగానిలే! జ్వరం త్వరలో తగ్గిపోతుంది."

సరళ బరువుగా ఊపిరి పీల్చి వదిలింది. ఇలాంటి భర్తను వదిలి బయటికెళ్ళి ఏం బావుకోగలదు? బయటికెళితే, ఇంతకంటె ఎక్కువ సుఖం దొరుకుతుందా? అలాంటప్పు డెందుకు బయటపడటం?

కానీ, కృష్ణవేణి! అవును కృష్ణ వేణి! తనమీద ఇంత ప్రేమగల భర్త కృష్ణవేణితో — తనదే తప్పు. తెలివిగా ఆలోచించాలి ఎలాగో కృష్ణవేణిని వదుల్చుకోవాలి. ఎలా?

సరళకు జ్వరం తగ్గింది. పథ్యం వండి మంచం దగ్గరకు తీసుకొచ్చింది కృష్ణవేణి సరళ మనసు చివుక్కు మంది. ఇలాంటి వ్యక్తిని గురించి తను అపోహపడుతుందా? ఛీ! ఛీ! ఈ మనసు. దీన్నేం చేసినా పాపం లేదు క్షణానికి కోటి విధాలుగా ఆలోచిస్తుంది

ఒకావిడ నాలుగేళ్ళ కొడుకుని వెంట పెట్టుకుని పేరంటానికి వెళ్ళింది. ఒక పేరంటాలు ఆపిల్లాణ్ణి చూసి "మీఅబ్బాయి ఎంచక్కా ముద్దొస్తున్నా డమ్మా!" అంది.

ఆ కుర్రాడు నిటారుగా నుంచుని గంభీరంగా "మా అమ్మకి తెలుసు. మీరేం చెప్పక్కర్లా" అన్నాడు.

"కృష్ణా! నా మేజోళ్ళెక్కడ పెట్టావ్?" లోపలినుంచి పిలిచాడు సుదర్శనం.

"వచ్చే..." అంటూ పరుగెత్తింది కృష్ణవేణి.

సరళ మనసు మళ్ళీ చివుక్కు మంది ఏమిటీ మనసు? ఎందుకిలా ఊగిపోతుందీ? తన మనసే ఇలాం టిదా? అసలు 'మనసే' అలాం టిదా?

## 9

కృష్ణవేణి సరళ మనసును దోలి చేస్తూంది. ప్రతిఫలంగా మరొక అందమైన సరళ తయారయింది. కృష్ణవేణి అలానే వుంది.

"సరళక్కా, ఈ జన్మంతో పడ లేకుండా ఉన్నానమ్మా!"

అంది కృష్ణవేణి తల రెండు చేతులతోనూ పట్టుకుని

అంతా మొంగారవంత అయింది.

అవును. జనం. వాళ్ళూరుకోరు — "సంస్కారం," "సహృదయం" లాంటి మాటలు వాడి తన నోరు కట్టేస్తారు కాని, జనం నోరు మూయ్యగలరా? బహుశః వాళ్ళు కృష్ణవేణిని బాధించి ఉంటారు. ఈ దెబ్బతో తోక ముడవాల్సిందే!

"ఏం జరిగింది కృష్ణవేణీ?" అంది సానుభూతి కనపరుస్తూ?

"నేనుబయటికి అడుగు పెట్టేసరికి నన్ను జనం ఈగల్లా చుట్టేస్తున్నారు."

"నిజంగానా? ఏమంటున్నారు?"

కొద్దిగా ముందుకు వొంగింది.




"అందరూ ఒకటేమాట! నేనుండబట్టి నువ్వింత వ్రాయగలుగుతున్నావుట. 'కృష్ణా! నిజంగా నీ దెంత మంచి గుండెతల్లీ.' నా బొంద అనుకుని నువ్వు ఇల్లు ఇల్లంతా నిర్వహించుకొస్తుంటే ఇదొక మూల కూర్చుని వ్రాసుకోగలుగుతోంది. నీలాటి స్వార్థత్యాగు లెందరుంటారు? పోనీలే! ఒక రచయిత్రి అభివృద్ధికి కారకురాలి వయ్యావు' అంటూ ఒకటే పొగడ్త. అయినా అంత పొగడ్తాని కిందులో ఏముంది సరళక్కా! అయినవాళ్ళకి చేస్తున్నాను కాని, కానివాళ్ళకి చేస్తున్నానా? మా సరళ ప్రఖ్యాత రచయిత్రి అయితే మాకు గొప్పేగా! మా మొహాల కేదీ లేదు. తీరికున్నా, లోకాభిరామాయణమే మా పని. నీలాంటి వాళ్ళు... ..."

"వెళ్ళి నీ పని చూసుకో!..."

చటుక్కున తన కాగితాల్లో తల దాచుకుంది సరళ.

తెల్లబోయింది కృష్ణవేణి.

"అయ్యో! నా మతి మండ! నీ టైమ్ పాడు చేస్తున్నాను చూడు. పోతానులే సరళక్కా! నువ్వు రాసుకో!"

వెళ్ళిపోయింది కృష్ణవేణి

సరళ కన్నీళ్ళు మనసులో మంటలకు ఆజ్యాలయ్యాయి

[సశేషం]




పెండ్యాలు రాజేశ్వరరావుగారు ఒకసారి అడిగారు: "ఆరుద్రగారూ మీ కేమన్నా భూము లున్నాయా" అని.

హైదరాబాద్ 'రోడ్రోం' వెళ్ళే క్రోవలో విశాలమైన భూముల్ని చూపిస్తూ, "ఆరుద్ర భూములన్నీ నావే గదండీ" అన్నా రాయన.

* * *

పబ్లిషర్సు నెలకు పది పదిహేను 'డిటెక్టివ్' పుస్తకాలు వేస్తున్నారు కదా? రచయిత లెలా రాస్తున్నారు? వాళ్ళెలా వేస్తున్నారన్న ధర్మ సందేహానికి ఆరుద్రగారి సమాధానం:
"డిటెక్టివ్ పుస్తకాలు రాయబడవండీ, కంపోజు చేయబడతాయి."

♦ ♦ ♦

"మన పూర్వ కవులందరూ 'చంటి వారే' నండీ అన్నారొకసారి, అధునిక కవిత్వాన్ని, కవుల్ని వెనకేసుకొస్తూ. "వాళ్ళందరూ కావ్యాలు 'శ్రీ వక్షోజ' అనో 'శ్రీ రామాకుచ' అనో ఆరంభించారు. వక్షోజాలను నోటపట్టని కవి కనబడటంలేదు. మరి చంటి కవులు కాక మరేమవుతారు?"

* * *

మన కవులందరికీ మదిర (రైల్వేస్టేషన్ కాదు) అంటే మహాయిష్టం. మదిరాపానం చేసినవాడే మహాకవి కాగలడు—అనే అపప్రథకు ఆరుద్రగారి సమాధానం.

"చరిత్రలో మదిర మత్తులో పడని వారు కూడా కనిపిస్తున్నారండీ. కాని వాళ్ళందరూ (మీరన్నట్టు) బాల కవులు గానే మిగిలిపోయారు. వట్టి 'చను బాల' కవులు."

* * *

అధునిక కవులకు సిగరెట్టు ఆరోప్రాణం. ఆరుద్రగారు సిగరెట్లు మానేసి ముచ్చటగా మూడేళ్ళయింది. పైగా అవి 'వర్జీనియా' పొగాకుతో తయారవుతాయి గనక వర్జించదగినవే అన్నారు. ***

సేకరణ :
విశిష్టా, నరసింహారావ్

# మరపురాని మధుర గాయకుడు

ఆ మధ్య నా చిన్ననాటి స్నేహితుడొకడు చాలకాలం తరవాత ఉత్తరం రాస్తూ 'ఆ రోజుల్లో సైగల్ పాటలంటే చెవి కోసుకునే వాడివి. ఇప్పటికీ అంతనా? లేక, జీవితం చేతిలో మొట్టికాయలు తిని తినీ, సైగల్ పిచ్చి పోయిందా' అని రాశాడు.

నిజమే. నా చిన్నతనంలో, కాలేజీలో చదువుకునే రోజుల్లో ఎప్పుడూ సైగల్ పిచ్చితో వుండే వాణ్ణి. రోడ్డుమీద పోతుంటే ఎక్కడ, ఏ ఇంటిలోంచి సైగల్ పాట వినబడితే అక్కడ ఆగిపోయేవాణ్ణి.

సైగల్ ఎన్ని సినిమాల్లో నటించాడో నాకిప్పుడు జ్ఞాపకం లేదుగాని, నేను చూడనివి, రెండుమూడు సార్లు చూడనివి, ఏ రెండో మూడో తప్ప వుండవు. అతడెన్ని పాటలు పాడాడో జ్ఞాపకం లేదు కాని, నేను విననివి లేనే లేవు.

కాలేజీ లేజీ జీవితం నుంచి ఉద్యోగపు కేజీ జీవితంలోకి మారిన తరవాత కూడా, నాటికీ, నేటికీ నా ఆరాధ్య గాయకుడు సైగల్. ఆనాటి వలెనే ఈనాడు కూడా అతని పాట ఎక్కడ వినబడినా మంత్రించినట్టు ఆగిపోతాను.

నాకు సైగల్ పాటలంటే ఇష్టం. అవి ఇష్టమైన వాళ్ళంటే ఇష్టం. అవి ఇష్టం లేనివాళ్ళ సంగీతాభిరుచినే కాదు, వాళ్ళని కూడా గౌరవించలేను.

రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి కథల్లో 'సైగల్' అనేది నాకు చాలా ఇష్టం. అది ఆయన కథా సంపుటాలలో దేనిలోనూ ఏ కారణం వల్లనో కనబడకపోవడం నాకు చాలా బాధ కలిగిస్తుంది.

రజనీకాంతరావుగారి పాట



కంటె, కవిత్వం కంటె ఆయనకి సైగల్ మీద వున్న ఇష్టమంటే నా కెంతో ఇష్టం.

రాజేశ్వరరావుగారు చిన్నప్పుడు సైగల్ వద్ద సంగీత శుశ్రూష చేశారట. ఆయనంటే నా ఇష్టానికి కారణాల్లో ఇది కూడా ఒకటి.

కేస్కార్‌గారు రేడియో శాఖ మంత్రిగా వున్నన్నినాళ్ళు ఆలిండియా రేడియోలో సైగల్ పాటకు స్థానం లేకుండా పోయింది. ఆయనంటే నాకు వొళ్ళు మండడానికి కారణాల్లో ఇది ఒకటి.

సిలోన్ రేడియోలో ప్రతి రోజూ ఎప్పుడో ఒకసారో, రెండు సార్లో సైగల్ గొంతు విధిగా వినిపిస్తుంది. పదిహేనేళ్ళుగా సిలోన్ రేడియో పట్ల నా మక్కువకు కారణాల్లో ఇదీ ఒకటి.



సైగల్ పోయి సరిగా ఇరవై ఏళ్ళయింది. ఈ మధ్య హైదరాబాదులో సైగల్ అభిమానులు కొందరు చేరి అతని వర్ధంతి జరిపారని, సైగల్ సంఘమో ఏదో స్థాపించారని పేపర్లలో చదివాను. వారిని మెచ్చుకోకుండా వుండలేను.

ఈ ఇరవై ఏళ్ళలో ఒక కొత్త తరం వచ్చింది. ఈ తరం వారికి సైగల్ పేరు చెబితే 'ఎవరతను ?' అని అడుగుతారు. సైగల్ పాట వింటే 'బోర్డమ్' ఫీలవుతారు. వారి విద్యా ప్రమాణాలు పడిపోవడానికి ఇదొక కారణమని నా ఉద్దేశం కాదుగాని, ఒకనాడు నా లాంటి లక్షలాది శ్రోతలను మురిపించి, మైమరపించిన సైగల్ పాట ఈనాటి వారికి పేలవంగా, నిస్సారంగా వినిపించేటంతగా సంగీతాభిరుచులు మారిపోయినందుకు బాధపడతాను.

నా పధ్నాలుగో ఏటనుంచో, పదిహేనో ఏటనుంచో సైగల్ నా జీవితంలో ఒక భాగమైపోయాడు. అప్పటికీ, ఇప్పటికీ అంత హాయి కలిగించే, అంతగా హృదయాన్ని స్పృశించే పాటని, గాయకుణ్ణి నేను వినలేదు.

ఈ ఇరవై ఏళ్ళలో మన సినిమాలలో గొప్ప గాయకులు రాలేదని నేను చెప్పను. ఒకరు కాదు, కనీసం ఒక డజనుమంది వచ్చారు.

లక్షలాది లతా మంగేష్కర్ అభిమానుల్లో నేనూ ఒకణ్ణి. ఆమె పాతికేళ్ళనుంచి సినిమాలలో పాడుతోందట ఇప్పటికి పదహారు వేలకు పైగా పాటలు పాడిందట. అన్ని పాటలు, అంత హాయిగా పాడినవారు ప్రపంచంలోనే అరుదు. ఇందులో అతిశయోక్తి ఏమీ లేదు. నేను కొన్ని సంవత్సరాల క్రిందట వృత్తిరీత్యా ఆమెతో ఇష్టాగోష్ఠి జరపవలసి వచ్చింది. తాను ప్రతి రోజూ రెండు పాటలు రికార్డు చేస్తానని ఆమె చెప్పింది. ఆ లెక్కన ఆమె ఇంకా ఎక్కువే పాడి వుంటుంది. ఒకసారి ఆమె పాటను ప్రత్యక్షంగా విన్నాను. మైక్ లోంచి వినబడేదానికంటె ఆమె కంఠం ఎన్నోరెట్లు బావుంటుంది. మేలిమి బంగారాన్ని కరిగించి సన్నని తీగలా సాగదీస్తుంటే ఎలా వుంటుంది? అలా అనిపించింది. ఉస్తాద్ బడే గులాం అలీఖాన్ ఆమెను 'శ్రుతికిరాణీ' అని వూరికే అన్నాడా?

పంకజ్ మల్లిక్ సంగతి ఇక్కడ రాయను. చాలా ఏళ్ళుగా సైగల్‌తో పాటు అతడు నా అభిమాన గాయకుడు. అతడింకా సజీవుడే అయినా, ఈనాటి యువక శ్రోతలకు అతడు సైగల్ మల్లేనే దాదాపు అపరిచితుడు.

మరి, రఫీ? అతడు కూడా ఇప్పటికి పదెనిమిది వేల పాటలు పాడి వుంటాడు. అంత వైవిధ్యం చూపించిన గాయకుడు సినిమా ప్రపంచంలో మరొకడు లేడు. అంత స్వర విస్తృతి కలిగిన కంఠం మరొకరికి లేదు. అతని మంచి పాటల్ని లెక్కపెట్టడానికి కొన్ని వందల చేతులు కావాలి.

ముఖేష్ పాటలు అన్నీ బాగుంటాయని నేను చెప్పను. అతని ముక్కు పాట చాలాసార్లు బావుండదు. అతనికి "ముక్కేష్" అని నా మిత్రుడు బిరుదు కూడా ఇచ్చాడు. కాని, ఆ ముక్కుతోనే అతడు ఎంత విషాద మాధుర్యం పొలికే పాటలు వినిపించాడు?

తలత్ అసమాన గాయకుడని నేను చప్పున అంగీకరించలేను. ఒకరు ఉపమించినట్లు, ఊటీలో చలికాలంలో రాత్రిపూట చొక్కా లేకుండా పాడుతున్నట్లు కాకుండా కంఠాన్ని మరికాస్త నిలకడగా వుంచుకుంటే అతని పాట యింకా బావుండేది. కాని, అతడు కూడా "ఏ హవా ఏరాత్ ఏచాందినీ" (?) లాంటి చక్కని పాటలు పాడలేదా?

కిశోర్‌కుమార్? అతడు బాగా పాడని పాటలు నాకు జ్ఞాపకంలేవు. అతని గాత్ర మాధుర్యం మరవ రానిది — ముఖ్యంగా "కోయీ హమ్‌దమ్ న రహా" లాంటి పాటల్లో.

ఎస్. డి. బర్మన్ సంగీత దర్శకుడుగా కంటె గాయకుడుగానే నాకెక్కువ నచ్చిన వాడంటే చాలామంది నవ్వుకోవచ్చు. కానీ,

ఆ బొంగురు గొంతుకనే ఎంత పొగరుగా, విగరుగా పలికిస్తాడు? ఎంత సున్నితమైన వయ్యారాలు పోతాడు? ఉన్నట్టుండి ఎంత సునాయాసంగా శిఖరాగ్రాన్ని తాకి అక్కడ నిలబడి పోతాము?



ఈ తరం వారికి తెలుసో లేదో గాని, నూర్జహాన్‌ది ఎంత మధుర గానం! పాకిస్తాన్ వెళ్ళిపోతే పోయిందిగాని, ఆ రోజుల్లో ఆమె పాట దేశాన్ని ఊపివేసింది. ఇప్పటికీ సిలోన్ రేడియోలో ఆమె పాట వినిపిస్తే శ్రీశ్రీగారు పేర్కొన్న "షాజహాన్ అంతఃపురంలో—మట్టుదీశింజానమెక్కడ?" అనిపిస్తుంది ఆమె కంఠం. మొగల్ పాదుషాల ఉద్యానవనాల్లో పూచిన గులాబీల వాసనలు, అత్తరుల ఘుమఘుమలు, అగరు ధూపాలు, మణిదీపాలు, పన్నీటి జలయంత్రాలు జ్ఞాపకం వస్తాయి.

ఇంకా గీతారాయ్, ఆశాభోస్లే, హేమంతకుమార్‌ల వంటి మధుర గాయనులు, గాయకులు ఎందరో వున్నారు.

కాని, నా సైగల్ లేడు. ఈ నిజం నన్ను ఉండివుండి ముల్లులా గుచ్చుకుంటుంది.

సాధారణంగా సినిమా పాటల ఆయుర్దాయం చాలా తక్కువ. 'బుక్స్ ఆఫ్ ది అవర్' లాగ, అవి 'సాంగ్స్ ఆఫ్ ది అవర్' ఈనాడు చాల బాగున్నవనిపించే చాలా పాటలు వినగా, వినగా కొద్ది రోజుల్లోనే అసందర్భంగా వినిపిస్తాయి. సైగల్ పాడినవి చాల వరకు సినిమా పాటలైనా అవి 'సాంగ్స్ ఆఫ్ ఆల్ టైమ్' అని పిలవదగిన శాశ్వతత్వమేదో వాటిలో వుంది. ఆ కంఠమాధుర్యమే దీనికి కారణమనుకుంటాను. అతను పాడిన పాడిన పద్ధతే కారణమనుకుంటాను

ఎన్ని రకాల పాటలు పాడాడు? ఒకసారి విషాదాన్ని స్పందిస్తూ! ఒకసారి వినోదాన్ని చిందిస్తూ! సముద్రంలో అలలు ఉవ్వెత్తున లేచి విరిగి పడుతున్నట్టు, దూరంగా ఒక మేఘం మంద్రమంద్రంగా ఉరుముతున్నట్టు అతని కంఠం గంభీరంగా

వినిపిస్తుంది. ఒక్కొక్కసారి కొండ రాళ్ళ మీద నుంచి దుముకుతూ, ఉరుకులు, పరుగులతో ప్రవహించే సెలయేటిలా వుంటుంది ఒకొక్కసారి మైదానాల్లో ప్రశాంతంగా ప్రవహించే మహా నదిలా మంద మందంగా వుంటుంది. ఏదో అవ్యక్త విషాదాన్ని, లేదా అవ్యక్తానందాన్ని స్ఫురింపజేస్తుంది.

సైగల్ పంజాబీ. అతడు కలకత్తా సినీ సీమలోకి ఎలా ప్రవేశించాడనేది మా చిన్నతనంలో రకరకాలుగా చెప్పుకునేవారు (అతడు బొంబాయి సినిరంగంలో ప్రవేశించివుంటే అతని సంగీతం మధురంగానే వుండేదిగాని, మరోరకంగా వుండేది.) కలకత్తాలో అతడు ఉద్యోగం చేస్తుండగా ఒక నాడు స్నేహితుల బలవంతంమీద ఏదో పాట పాడుతున్నాట్ట. యాదాలాపంగా అక్కడకు వచ్చిన న్యూ థియేటర్స్ అధినేత బి. ఎన్. సర్కార్ ఆ పాట విని వెంటనే బుక్ చేశాట్ట. అదికాదు, న్యూ థియేటర్స్‌వారి సంగీత దర్శకుడు ఆర్. సి. బోరల్ ముందుగా అతని పాట విని బుక్ చేశాడని కొందరంటారు. ఈ మధ్య బోరల్ ఒక వ్యాసంలో తానే ముందుగా సైగల్ పాట విని

బుక్ చేసినట్టు వ్రాసుకున్నాడు ఇదీ నిజమేమో మరి.

ఏమైనా, సైగల్ వంటి గాయకుణ్ణి పైకి తీసుకువచ్చి దేశానికి సమర్పించిన న్యూ థియేటర్స్ — ఈనాడు కాలవాహినిలో విలీనమై పోయినా- దానికి జోహార్లుఅర్పించవలసి వుంది. న్యూ థియేటర్స్ చిత్రాలలోనే, పంకజ్ మల్లిక్ ఆర్. సి. బోరల్ సంగీతదర్శకత్వం, లోనే సైగల్ ప్రతిభ మూడు పువ్వులూ, ఆరుకాయలుగా వికాసం పొందింది. అతడు న్యూ థియేటర్స్ విడిచి బొంబాయి చేరిన తర్వాత పాడిన పాటలను ఒక స్థాయి తక్కువవిగానే నా మట్టుకు నేను పరిగణిస్తాను. సత్యజిత్‌రాయ్ రాక ముందు భారత చలనచిత్ర సీమలో ఇద్దరే జీనియస్‌లు వుండేవారని, వారిలో ఒకడు సైగల్, మరొకడు కీర్తిశేషుడు పి. సి. బరువా అని నా నమ్మకం.

దుష్మన్ లో క్షయరోగగ్రస్తుడైన ప్రేమికుడుగా సైగల్ పాడిన "ప్రీత్ మే", "కరూఁ క్యా", "సితమ చే", లాంటి పాటలను ఎలా మరచిపోవడం? దేవదాసు లో "బాలమ్ ఆయె బసో మోరె మన్ మే", "దుఃఖ్ కే" రెండూ అమృత గుళికలు. స్ట్రీట్ సింగర్‌లో "బాలమ్ మొరా", జిందగీలో "సోజా రాజకుమారీ", ఎన్నటికీ పాతబడనివి. ప్రెసిడెంట్ లో దేనమకుంటూను "ఏక్ బంగల బనే న్యారా" అనే గొప్ప పాట. లగన్‌లో "కాహేకో రాడమచాయీ", "హ రేగయి", మై సిస్టర్ లో "దో నైనా", "ఘుపోనా" నాటికీ నేటికీ నేను చెవులు రిక్కించుకుని వింటాను. బొంబాయి వచ్చిన తరవాత సూరదాసులో అతడు పాడిన "రైన్ గయీ", "నైనహీనకో", తాన్‌సేన్ పాటలు కొన్ని, మళ్ళీ న్యూ థియేటర్స్ రోజుల్ని జ్ఞాపకం చేస్తాయి. నౌషద్ సంగీత దర్శకత్వంలో అతని పాటలు బాగా లేవని నేననను గాని, అతని సంగీత ఫణతికి న్యూ థియేటర్స్ సంగీత దర్శకుల శైలి నప్పినంతగా ఇతరుల శైలి నప్ప,

రోడ్డుమీద పోతున్న ఆసామీని ఘరానా బిచ్చగాడు ఆపుచేసి "కాఫీకి ఓ బేడ్డబ్బు లున్నాయా?" అని దర్జాగా అడిగాడు.

ఆసామీ తెల్లబోయి, "ఉన్నాయి గానీ, ఇప్పుడే ఇంటిదగ్గర కాఫీ తాగే బయల్దేరాను" అని ముందుకు వెళ్ళి పోయాడు.

లేదనుకుంటాము. నాతో ఎందరు ఏకీభవిస్తారో తెలియదు.

ఏమైనా, నేను మొదటనే మనవి చేసినట్లు సైగల్ పిచ్చి నాకినాటికి వదలేదు ఎన్నటికీ వదలదేమో కూడా. ఆ ముక్కే నా స్నేహితుడికి రాశాను.

ఉద్యోగపు చీకాకులు, సంసారపు ఈతి బాధలు ఎప్పుడైనా కాస్త తెరిపి ఇచ్చినప్పుడు, సంధ్యా రాగంతో పశ్చిమాకాశం ఎర్రటి, పచ్చటి మబ్బులతో అందగించినప్పుడు, చలిచలిగా ముసురుపట్టి పారిజాతం పువ్వులమల్లే చినుకులు రాలుతున్నప్పుడు, జీవితంలో చేయాలనుకున్నవీ, చేయలేక పోయినవీ జ్ఞాపకంవచ్చి మనస్సుని కోస్తున్నప్పుడు, ఎవరైనా ఆప్యాయంగా పలకరించినప్పుడు, ఒక మంచి పని చేసినప్పుడు, నా స్మృతిపథంలో సైగల్ కంఠస్వరం చల్లగా వినబడుతుంది.

ఒమర్ ఖయ్యాం రుబాయీలు, ఖాన్ సాహెబ్ ఠుమ్రీలు, కాళిదాసు మేఘసందేశం, షెల్లీకవిత్వం, కృష్ణశాస్త్రి బ్రహ్మసమాజం గీతాలు, 'జ్యోతి' మొదటి సంచికలమల్లే జీవితపు సహారాలో ఒయాసిస్సుల వంటివి సైగల్ పాటలు నాకు.

—సవ్యసాచి

***

"నీ పెనిమిటి సంకరయ్య నే. గిప్పుడే వొచ్చాడు. ఇంగ నిన్ను తీసుకోని పోతాడంట."

"సీ. అలాటోడు నా పెనిమిటూ?" ఎత్తుపండ్లు, బానెకొదు, దొడ్డ పెదాలు, లావుపాటి ముక్కు, నున్నని గుండు గుర్తుకువచ్చి రంగి మనస్సు వాడిపై అసహ్యంతో నిండి పోయింది.

సీ అంటూ పెరట్లో కెళ్ళిన రంగిని చూసి తెల్లబోయి ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు మల్లి, ఎల్లయ్యాను.

తెల్లారి అయ్య పొలం వేపు వెళ్ళడం చూసిన రంగి వెనక వెనకగా అయ్య వెంట వెళ్ళింది. కాస్సేపు అయ్యను దూరంనుంచే చూసి, వంగి చెట్లను చూస్తున్న అయ్య దగ్గరికి వచ్చి 'అయ్యా'! అది నెమ్మదిగా

తలెత్తిన ఎల్లయ్య "నవ్వేడికి వచ్చినావే" అన్నాడు రంగిని చూసి.

"నాను అనితో పోనయ్యా!" గునిసింది రంగి నెమ్మదిగా దగ్గరికి వచ్చి కూతురి భుజంపై చెయ్యి వేసి అనునయంగా "ఏంటికె! అనికే మయిందని?"

"అడు బాగోలేదయ్యా" తలొంచుకొని అంటున్న రంగిని చూసి పగలబడి నవ్వాడు ఎల్లయ్య. "మొగాడికి బాగేంటె? సంసారం సక్కబెట్టి, సల్లగా సూత్తె సాలదూ!"

"కాదయ్యా! నాను పోను" ఏడుపుతో మిళితమైన నిశ్చయం స్పష్టంగా ధ్వనించిం దాకంఠంలో. అది గమనించిన ఎల్లయ్య గంభీరంగా "నువ్వింకా సిన్నపిల్లవేనా రంగీ? సంకరయ్యకి మన మెంతో బాకీ ఉన్నాంగందా! మన ఇల్లు, పొలం, ఆఖరికి మనం అమ్ముడు పోయినా బాకీ తీర్చలేం గిప్పుడు నీవు పోకపోతే వాని బాకీ ఎట్టా కట్టేది నాను? నా దగ్గిర సిల్లకొత్తా నేదుగదా! మా మొగం సూసైనా అడితోపో అమ్మా!"

అయ్య గొంతులోని బాధను చూసిన రంగి ఏదో నిశ్చయానికి వచ్చినట్లు "నానుపోతున్నానయ్యా!" అని ఇంటికి తిరిగొచ్చేసరికి బావి దగ్గర ముఖం కడుక్కుంటున్నాడు శంకరయ్య. చేతిలోని నీళ్ళు రంగిపై చల్లి "ఎంటెహే, దర్శనమే లేదు". పండ్లు రెండూ బయటికి వచ్చాయి వెకాకోళంగా నవ్వుతున్న అతని నోట్లోంచి. "ఈ యెదవకి సెమత్కారం గూడా సేతనవును." రంగి మనస్సు అసహ్యంతో, జుగుప్సతో నిండిపోయింది.

పాకలోని లేగదూడ అంబా అని అరచేసరికి రంగి ఆలోచనలన్నీ చెల్లా చెదరయినాయి. అమ్మో! రేపే అడితో యెళ్ళాలి. అకోతి మొగంతో సంసారం సేసే కంటె సచ్చింది నయం! యధాలాపంగా అనుకున్న ఆ మాటల్ని మళ్ళీ అనుకొని ఉలిక్కి పడింది. "అమ్మో" అంది మనస్సు. ఆయేళ యెంకి బావిలపడి సస్తే

"ఏడ్చినా వుగందా" అని జ్ఞప్తికి తెచ్చింది.

తానుసస్తే – అయ్య, అవ్వ ఏడుస్తారు కొన్నిదినాలు. అటెనుక సుఖంగాఉంటారు ఇక ఆడోకి ఆడే మన్నాగానీ, తనకేందికి తాను సుఖంగా యెళ్ళిపోతుంది.

## పోటీదార్లకు మనవి

"జ్యోతి" చిన్న కథలపోటీకి రచనలు పంపే విద్యార్థినీ విద్యార్థులు గమనించవలసిన నిబంధనలు –

1. కథలు "జ్యోతి"లో రెండు, మూడు పేజీలకు మించరాదు.

2. స్వకపోల కల్పితమైన స్వతంత్ర రచనలే పంపించాలి

3. తమ పూర్తి పేరు, చదువుతున్న తరగతి, కాలేజి, లేక విశ్వ విద్యాలయం పేరుతో సహా తమ పూర్తి చిరునామా జతపరచాలి

4. ప్రతినెల 1వ తేదీ వరకు అందిన రచనలను ఆపై నెల సంచికలో పోటీ నిమిత్తం పరిగణిస్తాము

5. బహుమతి పొందని రచనలు త్రిప్పి పంపబడవు అందుచేత స్టాంపులు పంపించనక్కరలేదు రచనల విషయమై ఉత్తరప్రత్యుత్తరాలు జరుపబడవు.

6. కవరుమీద, రచన మొదటి పేజీ మీద "జ్యోతి చిన్న కథల పోటీకి" అని స్పష్టంగా వ్రాయాలి

నిశ్చయానికి వచ్చిన రంగి మనస్సు త్వరపడింది. లేచి గుడిసెలోకిపోయి అమ్మకాళ్ళకి మొక్కి, అయ్యకాళ్ళు మొక్కుదామని బయటికి వచ్చిన రంగికి కళ్ళు బైర్లుకమ్మాయి ముచ్చెమటలు పోశాయి నోటమాట రాలేదు అది నల్లని త్రాచుపాము. వెన్నెట్లో తళతళలాడుతూ పరుగెడుతోంది శంకరయ్యను కాటేసి. కాస్సేపటికి తేరుకుని "అయ్యోయ్ పాము!" అని గావుకేక పెట్టేసరికి హడావుడిగా లేచారుఎల్లయ్య, పల్లి 'ఎక్కడా' అంటూ. అప్పటికే శంకరయ్య నురుగులు కక్కుతున్నాడు.

రంగి హృదయంలోని అసహ్యం, జుగుప్స జాలి, ప్రేమగా మారిపోయాయి. శంకరయ్య బాధను చూస్తూంటే, ఎవరినైతే ఇంతవరకు తనకు కంటకంగా ఎంచిందో, ఎవరిని అసహ్యించుకుందో, అతను బాధతో, జీవితంపై ఆశతో మృత్యుదేవతతో అఖరిక్షణంవరకు పోరాడి, పోరాడి, ఓడిపోయిన అతనిని చూస్తుంటే రంగి స్త్రీహృదయం బాధగా మూలిగింది కన్నీరు చెంపలపైని జాలువారుతుండగా నిలిచిన రంగిని చూసి తండ్రి నివ్వెరపోయాడు—

అదే స్త్రీలోని అమృత హృదయం ఆ హృదయమే స్త్రీకి పెట్టని అభరణం.

***

# ఆమె అంతరంగం

రెండవ బహుమతి [రు. 25] కథ

తను ఆ బెడ్ మీదకొచ్చి అయిదు రోజులు అవుతుంది. ఈ అయిదు రోజులనుంచి నరకాన్ని అనుభవిస్తోంది తను. అంతా యేదో నిస్సారంగా, నిస్సత్తువగా వుంది. భయంకరంగా అనిపిస్తోంది. ఆ పరిసరాలు డాక్టర్లు, నర్సులు, రోగులు-అదంతా ఎందుకో వెగటుగా ఉంది. తన జన్మలో యెప్పుడూ ఆస్పత్రిలో ఉండవలసినంత అవసరం రాలేదు. ఇంట్లో పనితోనే జీవితమంతా గడచిపోయింది. క్షణం తీరిక లేకుండా ఉండేది

పెళ్ళయినది మొదలుగా ఆయన చేతుల్లో పడరాని పాట్లు పడింది. బిడ్డలయినా అభివృద్ధిలోకొస్తారు, కనీసం వాళ్ళని చూసుకొనైనా మురుద్దామంటే దేవుడు ఆ కోరిక కూడా తుడిచి పారేశాడు. బ్రతుకు అంతా శూన్యం తనకు. తనగుండెలో ఆశలు మండుతున్నాయి. ఇంకా యెందుకో తనకీ కోరికలు? బ్రతుకంతా యెండమావిలా గడచిపోయింది తనకి తెలిసినంతవరకు యే కోరిక తీరలేదు. కనీసం ఈ 'చివరికోరిక' అయినా తీరుతుందేమోననుకుంది అదీలేదు తనకు ఆపరేషన్ సక్సెస్ అయింది.

ఈ ఆస్పత్రిలో వున్న కొద్ది రోజులయినా ఇలు మరచిపోదామని వచ్చిందితను. కాని తన ఆలోచనల్లో యెప్పుడూ ఆ ఇల్లే, ఆ పిల్లలే వుండేది. వాళ్ళే తన చుట్టూ పరిభ్రమించేది. వాళ్ళనే తను క్షణకాలం మరచిపోలేనిది. తను లేకపోతే ఇంట్లో ఒక్కరోజు గడువదు. అయినా తను ఒక్కొళ్ళకీ పనికిరాదు ప్రతి ఒక్కళ్ళు విదిలించి కొట్టేవాళ్ళే తన మాటని, తననీ లక్ష్యపెట్టేవాళ్ళేలేరు. ఎవరి మటుకు వాళ్ళు తమకు కావలసినవి చేయించుకుంటారు. ఈ బట్టలుతికిపెట్టు, ఈ చొక్కా కుట్టిపెట్టు అంటూ. ఆఖరికి చిన్నవాడు కూడా తనను లెక్కచేయడు.

**కె. అంజనీబాబు**
యం.ఎ., ఫైనల్, అప్లైడ్ ఎకనమిక్స్
ఆంధ్రా యూనివర్సిటీ, వాల్తేరు.

నీకేం తెలుసు పో అని విదిలించి కొడుతుంటాడు తనని. తను వీటి న్నింటికీ యేమీ చేయలేదు. ఏమన్నా తిట్టిందా, ఇక తన ప్రాణం తీస్తారు అంతా కలసి. బ్రతుకంతా ఆరని జ్వాల నిండిపోయింది తనకు

పెద్దపిల్లకి పెళ్ళయినప్పట్నించీ తనకు మరీ ఆదరణే తగ్గిపోయింది ఇంట్లో. ఆ మెప్పుంటేకనీసం తన కష్టాలలో భాగం పంచుకోడానికి ప్రయత్నించేది తనని అర్థం చేసుకోవడానికి యత్నించేది. రెండోదానికి తన పొడంటేనే గిట్టదు. దానికి తోడు చదువన్నా అబ్బుతుందంటే అదీ లేదు ఎపుడన్నా పొరపాటున సినిమాకి దానితో వస్తానంటే ముసుగు పెట్టుకు పడుకొంటుంది ఇక తను చేయగలిగిందల్లా వంటింట్లోకి పోయి కళ్ళు ఒత్తుకోవడమే. అయినా దాని మీద ఎందుకో జాలి ఇంట్లో అందరి మీదా తనకు జాలి, అమితమైన ప్రేమ. తన కోరికలు, తలరాత లేక నెరవేరలేదు.గాని వాళ్ళంతా యేం చేస్తారు? అయినా ఇంకా ఎప్పుడో తనబ్రతుకు బంగరు పంటగా మారుతుందని అడుగడుగునా కలలే.

ఇవన్నీ భరించలేకనే ఈ ఆస్పత్రిలో నయినా కొద్ది ప్రశాంతి దొరుకుతుందేమో అనుకుంది కాని ఇక్కడే కాదు యెక్కడా దొరకదేమో తనకి ఆ శాంతి, ప్రశాంతి. ఎంత సేపటికి ఇల్లే గుర్తు కొచ్చి బెంగగా ఉంటుంది. ఆయనకి అన్నం పెట్టి, మంచినీళ్ళిచ్చే లోపలే అమిత కోపం వస్తుంది, కొద్దిగా ఆలస్యమయితే. పాపం రెండోదేం చేస్తోందో, ఎలాచేస్తోందో? ఎందుకో కళ్ళల్లోనుంచి నీరు అప్రయత్నంగా కారిపోతోంది.

పెద్దవాడు తనని అసలు లెక్కలోనే వుంచడు తనమాటే ఖాతరు చేయడు పోనీ చదువుకుంటున్నాడని సర్దుకుపోతుంది తను వాడికి టైఫాయిడ్ వచ్చినప్పుడు తను యెంతగా చలించిపోయిందో, ఎంత మంది దేవుళ్ళని ప్రార్థించిందో? ఇదే ఆస్పత్రిలో వాడుంటే ఎంత లేదన్నా రెండు మూడుసార్లు వచ్చేది ప్రతిరోజు ఆస్పత్రిలో చేరిన మొదటి రెండు రోజులలో 105-106 డిగ్రీల జ్వరంకాస్తే ఏడవలేక సొమ్మసిల్లింది తను ఆ రెండు రోజులు వాడు కళ్ళు తెరవకపోతే తన కళ్ళల్లో వత్తు లేసుకుంది కాని వాడు తను ఆస్పత్రిలో వుంటే ఒక్కసారి మాత్రమే కనపడి పోయాడు ఎందుకో వీళ్ళందరికీ తనింత భారం, తనంటే ఇంత అయిష్టం? వీళ్ళందరినీ తనే కన్నది, తనే పెంచింది. అయినావీళ్ళకే తనుపనికి రాలేదు. కనీసం ఇంటిప్రక్కవాళ్ళున్నంత ఉదారంగానైనా ఉండలేరు. ఎందుకో, ఎందుకో? తన ప్రశ్నలకి సమాధానాలే లేవు వీళ్ళంతా తనని లెక్కచేయరు. వీళ్ళని మరచి క్షణం వుండలేదు వారంపాటైనాదూరంగా ఉంటానుకదా, అపుడు తన అవసరం తెలిసి వస్తుంది అనుకొంది. కాని ఆ వారం కూడా ఉండలేకపోతోంది తను. లాభంలేదు. త్వరగా ఇంటికి వెళ్ళిపోవాలి డాక్టరు కావాలన్న విశ్రాంతి అక్కడేదొరుకుతుంది తనకు. ఇవాళేడాక్టరు నడిగేయాలి. ***

# అపూర్వ సన్మానం

రెండవ బహుమతి [రు.25] కథ

విశాఖపట్నం వెళ్ళగానే మంచి వసతి చూచుకోవాలి. ప్రతిరోజు సాయంత్రం సముద్రతీరానికి వెళ్లాలి. అలా ఎన్నో మధురభావాలు మదిలో చెలరేగుతుండగా స్టేషనులో గంటకొట్టారు. ఆరున్నర అయింది. రైలు గూడ్సుబండి వేగంతో వచ్చి ఆగింది. పెట్టె, బెడ్డింగు ఎత్తుకున్నాను. కాని ఆ దేమి రద్దీ! ఎక్కడా చోటు లేనట్లున్నది. కమ్మీలను పట్టుకొని తలుపులవద్ద ప్రయాణీకులున్నారు. ఇక విధిలేక టికెట్ కలెక్టర్ సాయంతో 'స్లీపర్ బెర్తు' టు టైర్)లో ఎక్కి, మరో మూడు ముప్పావలా చెల్లించుకొన్నాను. తంతే బూర్లె గంపలో పడ్డట్లు అయింది నాపని. అసలు బెర్తు రిజర్వు చేసికొన్నతను ఆఖరు నిమిషంలో రద్దు చేసికొన్నాడట. 'మహానుభావుడు!' అనుకొన్నాను.

రైలు విశాఖపట్నం స్టేషన్లో ఆగింది. ఆరున్నర అయింది. కూలీని పిలుద్దామని తలుపువద్దకొచ్చాను! ప్లాట్‌ఫారంమీద వున్న ఒకడు "టైమెంతండీ?" అన్నాడు. 'ఆరున్నర' అనబోయి, రాత్రి చలిగాలికి ముక్కు మూసుకొని పోయినందున, 'అరుద్దర...' అంటూ తర్వాత చెప్పలేకపోయాను. అంతే! ఆ ప్రక్కనే పరుగెడుతున్న ఒక విద్యార్థి 'ఇక్కడే ఉన్నారండీ' అని ఒక కేకేసి నా వద్దకు వచ్చాడు. అతని వెనుకనే నలుగురు విద్యార్థులు, ఇద్దరు విద్యార్థినులు వచ్చారు. వెంటనే ఒకరు నా మెడలో గులాబీలహారం వేశారు. నేను ఏమీ అర్థంగాక చూస్తుండగానే, పెట్టె, బెడ్డింగును ఎత్తించుకొని, స్టేషన్ బయటకు తీసికొచ్చి, అక్కడున్న కారులో కూర్చోబెట్టి, ముందు వెనుక సీట్లలో వాళ్ళు సర్దుకున్నారు. ఒక పెద్ద ఇంటిముందు కారు నిల్పారు. నా కనిపించింది, 'నేను బయలుదేరేటప్పుడు ఎవరైనా స్నేహితులు నేను వస్తున్నట్లు వ్రాసి వుంటారు'


ఇస్కా వసంతకుమార్

రీసెర్చి విద్యార్థి,
అప్లైడ్ ఎకనమిక్స్ అండ్ కో-ఆపరేషన్
ఆంధ్రా యూనివర్సిటీ, వాల్తేరు.

అని. 'అయినా ఆ మాత్రం మర్యాద కైనా నేను నోచుకోలేవా' అనుకున్నాను.

స్నానం కాఫీ, ఫలహారాల తర్వాత, "మనం వెంటనే బయలుదేరుదాం" అన్నాడు ఒక విద్యార్థి. నేను "అలాగే"నని బయలుదేరాను కారును ఒక కళాశాల ప్రాంగణంలోనికి తీసికెళ్ళారు. కళాశాల ప్రిన్సిపాల్ కాబోలు నాకు స్వాగతమివ్వడానికి వచ్చారు. నన్ను సాదరంగా తన గదిలోనికి తీసుకొని వెళ్ళారు. ఆ తర్వాత అయిదు నిమిషాలకు 'దయ చేయండి." అన్నారు. నలుగురు విద్యార్థులు, ప్రిన్సిపాల్ కూడా నాతోనే బయల్దేరారు

ప్రిన్సిపాల్ గదివదలి మరో హాల్లో ప్రవేశించబోతుండగా అందులో చాలామంది విద్యార్థులు, విద్యార్థినులు కూర్చొని వున్నారు. అది సమావేశ మందిరం అన్నమాట. వేదిక మీదకు నన్ను, ప్రిన్సిపాల్‌ను తీసికొని వెళ్ళి కూర్చొబెట్టారు. నాకు కొంచెం కష్టమేసింది ముందుగా చెప్పాచెయ్యకుండా, ఎంత స్నేహితులు వ్రాసే మాత్రం (అని నా భావన) ఇలా వేదిక మీదకు తీసికొని వెళ్ళడం సబబుగా తోచలేదు.

నే నేదో ఆలోచిస్తుండగా, ప్రిన్సిపాల్ పేర ఒక టెలిగ్రాం వచ్చింది. ఆయన వేదిక మీదనే కవరును తెరిచి, చదివి దిగ్భ్రాంతులయ్యారు. ప్రిన్సిపాల్ నెమ్మదిగా నా భుజం తట్టి రమ్మన్నట్లు సైగచేసి, వేదికదిగి తన గదిలోకి దారి తీశారు. నేను వెంబడించాను.

"మీ రెవరు?" అన్నారాయన.

నేను చెప్పాను. లోపల మండిపోయాను.

"పొరపాటు జరిగిపోయింది మిమ్మల్ని సినిమా రచయితగా మా విద్యార్థులు అపోహపడ్డారు. ఈరోజు ఆయన ఉపన్యసించవలసి వున్నది. అయితే రాలేకపోయినందుకు చింతిస్తూ పంపిన టెలిగ్రాం రాత్రి చేరవలసింది, ఇప్పుడు చేరింది. జరిగిందేదో జరిగింది, ఇప్పుడు ఉపన్యాసమెలాగా? అని నా భయం" అన్నారు ప్రిన్సిపాల్.

అప్పుడు పూర్తిగా అర్థమైంది నాకు. అయితే వారి సమావేశాన్ని నిర్విఘ్నంగా కొనసాగించడానికి ఒకచిన్న అబద్ధమాడాను."నేనుకూడా కొద్దో గొప్పో రచయితనే. నాపేరు.. మీరనుకున్న ఆ రచయిత రాలేక ఈ చిన్న రచయితను పంపాడని వేదికమీదనుంచి ప్రకటించండి" అని ప్రిన్సిపాల్‌తో చెప్పాను. ఆయన ముఖం విప్పారింది సంతోషంతో.

ఎటువంటి అలజడిలేకుండా సమావేశం అయిపోయింది. ప్రిన్సిపాల్ కూడా నన్నభినందించారు. మద్రాసు – హౌరా జనతా ఆలస్య మయినందుకు నాకు జరిగిన సత్కారం కలలోకూడామరపురానిది. ఎందుకంటే, ఇదంతా జరిగింది కలలోనే

***

జ్యోతి

# కిశోర ప్రాయం

విజయలక్ష్మీ రామకృష్ణన్

(గత సంచిక తరువాయి)

ఆ మర్నాడు జానకి తిరిగివచ్చింది.

'అన్నయ్య ఊళ్ళో లేరు వచ్చాక చెప్పి కబురు పంపుతాను లెండి వదిన' అన్నది అనంత కాస్త దిగులు తీరి కాలేజికి వెళ్ళింది

సాయంత్రం ఇంటికి వచ్చి 'ఆ వెనక వరండా తలుపు ఎందుకు వేశారు ఇల్లంతా చీకటిగా లేదూ' అన్నది 'ఆ తలుపు తియ్యకు, ఆ వైపు వెళ్ళకండి ఎవరూ కాసేపు' అన్నది జానకి. 'ఏమయ్యింది' అనడిగింది అనంత. జానకి మాట్లాడలేదు ఇల్లు ఊడుస్తున్న పనిమనిషి 'ఆవు కష్ట పడుతోందండీ పాకలో' అన్నది.

అంతకు కళ్ళు ఝల్లుమంది. అనంతపన్నెండేళ్ళ వయసులో బండిలో స్కూలుకు వెళ్తున్న దొకనాడు. దారిలో ఒక చెట్టు క్రింద ఈనడానికి కష్టపడుతున్న మేకను చూసింది. భయంతో వణికిపోయింది. అప్రయత్నంగా రెండు చెంపలు వాయించుకుని 'దేవుడా, మేకపిల్ల తేలిగ్గా పుట్టేట్టు చెయ్యి' అని దణ్ణం పెట్టుకుంది ఆ చిన్న వయసులో కళ్ళబడిన ఆ దృశ్యం ఎప్పటికి మరపురానిదయిందామెకు.

ఆ భయంతోనే మెడిసిన్ చదవడానికి భయం కలిగిందామెకు. కలత చెందిన మనసుతో ఏమి తోచక డాబా మీదకు వెళ్ళి పిట్టగోడమీద కూర్చుంది వెనుక నుంచి గొడ్డు మూలుగు వినబడి తెల్లబోయి తిరిగి చూసింది. రోహిణి ఇంకా కష్టపడుతూనే వున్నది. భయం ఆవహించగా గబగబా మెట్లు దిగి క్రిందకు వెళ్ళి తన పక్కమీద ఒడ్డిగిలి

రోహిణికి తేలిగ్గా పురుడు కాగలందు లకు దేవుణ్ణి ప్రార్థించసాగింది కాని ఆ తెల్లారేసరికి రోహిణి యీనలేక చచ్చిపోవడం, దూడ బ్రతికి బైట పడడం జరిగింది. జానకి కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ 'దాని తల్లి చావే దానికి వచ్చింది. లక్ష్మి అయిదు యీతలన్నా అనుభవించింది నాతల్లి మూడో యీతకే మట్టిలో కలిసింది' అన్నది.

తెల్లవారి కాఫీ అయినా త్రాగకుండా కూర్చొని కళ్లు ఒత్తు కుంటున్న భార్యను చూచి అసహ నంగా 'ఆపేక్ష ఎప్పుడూ సెంటి మెంటల్‌గా ఉండకూడదు జానకీ' అన్నాడు నారాయణరావు.

అనంతకు ఒళ్ళు దహించుకు పోతోంది. అది రోహిణి పోయిం దన్న దుఃఖం మాత్రమే కాదు. ఆమెను ఎక్కువగా బాధించినది అది యీనలేక చచ్చిపోవడమే! అనం తకు ఆ నిమిషంలో పురుషజాతి పైనే పగలాంటి భావం కల్గింది. ఆ కోపం, ఆ బాధ ఎట్లా ప్రకటిం చాలో తెలియలేదు. నారాయణ రావుతో 'ఔను, ప్రాణంలేని కారు మీద ఆపేక్షతో అది డొక్కయినా అమ్మలేక పోవడం సెంటిమెంటు కాదు. ఇంట్లో పుట్టి పెరిగిన ఆవు చచ్చిపోతే, అత్తయ్య ఏడిస్తే అది సెంటిమెంటల్ ట్రాష్!' అని అనేసి గబగబా అక్కడనుంచి వెళ్ళి పోయింది. ఎవరినైనా గట్టిగా తన్నా లనిపించేంత కక్షగా వున్నది అనం తకు. ఆ కక్ష లోపల ఇముడ్చు కోనూలేక బైట పెట్టనూలేక సత మతమయిపోయింది.

'నీ రోహిణి లక్ష్మిలాగే పోయింది బావా – దాని దూడకు 'నందిని' అని పేరు పెట్టాం. నువ్వు వచ్చాక చిన్న తువ్వాయికి అరటిపళ్ళు, బిస్కట్లు పెడుదువు గాని, మన కంతే ప్రాప్తం' అని వ్రాసింది.

వాసు దగ్గరనుంచి బదులు వచ్చింది. రోహిణి కష్టపడితే, అక్కడ వెటర్నరీ డాక్టరుకు చూపి సలహా తీసుకోవాలనుంది. అన్యా యంగా దాన్ని చంపారు మీ అజ్ఞా నంలో! నందిని బాగా వుందా? పాలు కొని పోస్తున్నారా?' అని వ్రాశాడు. 'మీ అక్కను మోహన్ కిస్తారని వ్రాశావు. అదృష్టవంతుడు మోహన్. లేకపోతే వసంతలాంటి భార్యను పొందలేడు. మోహిని సంగతి వ్రాశావు. మోహిని అంద మైనదే! అయితే నా భార్య కేవలం అందకత్తె కావడం కాదు నేను కోరుకునది! గుంటూరు లాంటి పట్టణంలో పెరిగినా, హైస్కూలు చదువే పూర్తి చెయ్యలేదు మోహిని! నాకు కాస్త మోడరన్ గర్ల్, కాస్త నాగరికురాలు కావాలి;

సీరియల్



అమ్మకు చెప్పు — ముందుగానే!"
అని వ్రాశాడు.

అనంతకు తల దిమ్మెక్కి పోయింది, వాసు ఉత్తరం చూచి. "మోహిని ప్రేమ కడా ఫలించబా? తనకు చదవు పుణ్యమా" అని అబ్బిన నిబ్బరంతో మనసును నిలదొక్కుకో గలిగింది. కాని మోహినికిది సాధ్యమా? ఏమవు తుంది మోహిని ఈ కబురు వినితే?" అనుకుని వాపోయింది అనంత.

"వసంత లాంటి భార్యను పొందడానికి మోహన్ అదృష్టవంతుడు. నాకు కాస్త మోడరన్ వైఫ్ కావాలి" అని వ్రాశాడు వాసు. అంతే వాసు కసు మీద

'ఇష్టం కలిగిందా ఏం!' అనుకుంది అనంత. ఆలోచిస్తుండగానే జానకి పిలవగా లేచి వెళ్ళింది అనంత. జానకి నవ్వుతూ 'అనంతా నీ స్నేహితురాలు కామేశ్వరికి కొడుకు పుట్టాడట విన్నావా' అన్నది. కామేశ్వరి అక్క, ఉయ్యాల పేరంటానికి బొట్టు పెట్టడానికి వచ్చింది. విచారపుంగా [illegible] అనంత [illegible] 'ఆ ముఖం [illegible] బిడ్డ ఎవరిలా ఉన్నాడు' అని అడిగింది. కామేశ్వరి అక్క 'తల్లీ, బిడ్డా కులాసానే, రేపు సాయంత్రం తప్పకుండా రండి' అని వెళ్ళిపోయింది.

మర్నాడు జానకి ఇరుగుపొరుగు పిల్లలనూ వెంటబెట్టుకుని పేరంటానికి వెళ్ళింది. కాముడు బిడ్డకు ఒక సిల్కు బట్ట, వెండి గిలక యిచ్చింది జానకి. పాట పాడమని అడిగారు అనంతను 'నాకు జోలపాటలు రావండి' అన్నది అనంత. ఎవరో తల నెరిసిన ముత్తయిదువ పాడడం మొదలెట్టింది 'తొలుత బ్రహ్మాండంబు తొట్టి గావించీ, నాలుగూ వేదముల గొలుసు లమరించి ...'

'ఎన్నాళ్ళయిందీ పాట విని' అనుకుంది జానకి.

'పట్టువలె నల్లురిని
పడిలంబుగానూ
కట్టువలె ముగ్గురిని
కదలకుండగానూ
వుంచవలె వక్కర్ని
హృత్కక్షుష్షు. కూ'

పాడుతూనే ఉన్నదా ముత్తయిదువ. జానకి పరవశంగా వింటోంది. లేచి ఉయ్యాల దగ్గరకు వెళ్ళి బిడ్డను చూచారు. అనంత కొయ్యబారి పోయింది బిడ్డను చూసి. బిడ్డ పైన పెనవి చీలి వుంది. కామేశ్వరి తల్లి జానకితో 'అనేక సృష్టి పెట్టాడు దేవుడు. అయిదో నెల్లో తీసుకు వచ్చాం సూడిదోచ్చి. మూడో నెల్లో ఆ బోలు గ్రహణం వచ్చిందట. అప్పటికి నాకు కబురే తెలియదాయె జాగ్రత్తగా ఉండమని వ్రాయటానికైనా! గ్రహణంలో బైట తిరిగి ఉంటుంది. ఈ కాలపు పిల్లలకు అన్నీ చెప్పాలిసిందే రాయె! అయినా మన గ్రహచారం బాగుంటే ఏ కొరతా లేదు' అంది. జానకి 'బెంగ పడకండి, అమ్మాయికి మీరు ధైర్యం చెప్పాలి. ఈ రోజుల్లో డాక్టర్లు ఎంతటి సాహసాలు చేస్తున్నారు? ఇదొక లెఖ్ఖా? తేల్గ్గా కట్టేస్తారు. మీరు ధైర్యంగా వుండాలి' అన్నది.

ఇంటికివచ్చాక అనంత 'అత్తయ్యా ఏమిటి కాముడు వాళ్ళమ్మ గ్రహణం అన్నారు, నాకేమి అర్ధం కాలేదు' అనడిగింది. జానకి చిరాగ్గా 'ఫరవాలేదు అర్ధం కాకపోతే. నీకెందుకు నానాసాని కబుర్లు?' అని వెళ్ళిపోయింది. అనంత మనసు పూర్తిగా చెడిపోయింది 'ఏమిటీ సృష్టి? బోటనీలో చదివాను 'పార్థినో జెనిసిస్' అని పురుష సంపర్కం లేకుండానే

కొన్ని చెట్లు జాత్యభివృద్ధి చేసుకుంటాయట. అది మనుష్యులకు సాధ్యమైతే ఎంత బాగుండును, ఏమంటావు అక్కా" అనడిగింది అనంత.

వసంతకు అనంత ఆవేదన, విచారం అర్థం కాలేదు. పకపక నవ్వుతూ "ఏం. ప్రపంచంలో జనాభా పెరగడం లేదని విచారమా! నీ మొహం, ఇంకెవరితో మాట్లాడకు ఇట్లా, నవ్వుతారు!" అన్నది. "అక్కకు ఎందుకు ఇటువంటి విషయం దారుణంగా అనిపించడం లేదు" అని ఆశ్చర్యపడింది అనంత. ఆ రాత్రి నిద్రపట్టలేదామెకు. కళ్ళుమూస్తే కామేశ్వరి కొడుకు, చీలిపోయిన పెదవి కనిపించేది! అనంతకు ఎప్పుడో చదివిన చైనా సామెత గుర్తుకు వచ్చింది.

"ప్రేమ నక్షత్రంలాంటిది. దాన్ని చూస్తూ నేలమీద నడిచే మనుష్యులు సంసా[illegible] పడిపోతారు అని. "[illegible] మనుషు[illegible] పుట్ట బో[illegible] సం[illegible] బాగుంటార[illegible] గ్యారంటీ ఎవరిస్తారు? కామేశ్వరి, ఆమె భర్తకూడా ఏ లోపాలు లేనివాళ్ళు. వాళ్ళ బిడ్డకు ఎందుకు లోపం కలిగింది?" ఆలోచిస్తూనే వుంది అనంత.

వసంత చెల్లెలివంక చూస్తూ "హేర్ లిప్ చూసే ఇంత బాధపడుతున్నావు ఇంత అసహ్యించుకుంటున్నావు! నేను మెడ్రాసు మెడికల్ కాలేజి మ్యూజియంలో చూశాను ఓ వంద



"అన్నమానం అప్పు కావాలి, అప్పు కావాలంటావు. నా దగ్గర డబ్బు చెట్లమీదేమన్నా కాస్తోం దనుకున్నావా?"

"అవును నీకు నచ్చే డబ్బంతా ద్రాక్ష తోటలమీదేగా?"

రకాల వికార శిశువుల్ని! జాడీల్లోని స్పెసిమన్స్. అవి [illegible] నుంచి ఒక ఏడాది నిద్రపోలేదు లాగుంది! మాసిది కర్మపో. మన మనసు చెడగొట్టుకుని ఏం లాభం" అన్నది. అనంత మనసు శాంతించలేదు!

గుంటూరునుంచి జానకి పినతల్లి వచ్చింది. వసంత, అనంత ఆదుర్దాగా ఉన్నారు ఆమె తెచ్చే కబురుకోసం. ఆమె నెమ్మదిగా చెప్పిన సంగతేమంటే వాళ్ళ అమ్మాయిని వాసుకు చేసుకునే పక్షంలో రాఘవరావుగారు తర్వాత వాళ్ళ అబ్బాయికి చేసుకోడానికి అభ్యంతరం లేదు.. కాని

పెద్దమ్మాయి వద్దట జానకి పెంచింది కనుక చిన్నమ్మాయి నయితే ఒప్పుకుంటారట ఆ మాట విన్న అనంతకు ఒకసారి ఒళ్ళు ఝల్లుమంది. 'అంతే మోహన్‌కు ఇష్టమేనా నేనంటేనే హాయ్ హాయ్' అనుకుంది.

కాని, వెంటనే వినవచ్చిన నారాయణరావు మాటవిని ఆమె ఉత్సాహమంతా నీళ్ళుకారి పోయింది రాఘవరావు నిట్టూరుస్తూ వసంతను రాజకుమారులాగ పెంచాను. పెళ్ళి చెయ్యబోతే ఒకటీ కలిసిరావడంలేదు. కానీ! అనంతకైనా పెళ్ళి చెయ్యాలికదా! దానికి అవస్థ పడటమెందుకు? పోనీ దాన్నే ఇద్దాం, ఒకరికైనా స్థిరం చేసుకుందాం. అయితే వాను వాళ్ళమ్మాయిని చేసుకుంటాడా మరి' అన్నాడు రాఘవరావు ఆశ కూడ దీసుకుంటూ. అప్పటి వరకు మెదలకుండా వున్న నారాయణరావు సహనాన్ని కోల్పోయి 'నాన్సెన్స్, నాకీమేనరికాలు గిట్టవు శాస్త్ర రీత్యానే కాక, చట్ట రీత్యాకూడా సమ్మతంకాని పెళ్ళిళ్ళు నే నామోదించలేను. వాసు, జానక్కి కావాలనుకుంటే నా ప్రమేయం మాత్రం లేదు అది వాళ్ళిష్టం మీరు వసంత కోసం మోహన్ను ఏర్పాడతానంటే సరే నన్నాను కాని అనంతను మోహన్‌కివ్వడం మాత్రం కుదరదు. అనంత మీద నేను ఎన్ని ఆశలు పెట్టు

---

## స్నేహితులెందరు ?

కొందరు స్నేహితులు కలిసి హోటల్‌కు వెళ్ళి టిఫిన్ తిని, కాఫీ తాగారు బిల్లును సమానంగా పంచుకుని చెల్లించుదామనుకున్నారు. ఒక్కొక్కరు 65 పైసలు చొప్పున ఇస్తే మొత్తం బిల్లు కంటె 70 పైసలు తక్కువౌతుంది. అందుకని తలా ఒక 75 పైసలు చొప్పున వేసుకున్నారు. అప్పుడు బిల్లు మొత్తంకంటె పది పైసలు ఎక్కువైంది. ఆ పది పైసలు సర్వరుకు వదిలిపెట్టారు.

మొత్తం ఎందరు స్నేహితులు ? వారికైన బిల్లు ఎంత ?

(జవాబు 102 పేజీలో)

-కున్నాను? షేక్స్పియర్ స్పెల్లింగు తెలియని మోహన్ను నేను బ్రతికుండగా అనంత పెళ్ళాడలేదు. అన్నాడు.

అందరు నిర్ఘాంతపోయారు. ఫ్రెడ్డీని పెళ్ళాడతానని ఎలిజా అంటే హిగిన్స్ పడ్డ బాధ నారాయణరావుకు అప్పుడు అర్థమైంది.

"నేను బ్రతికుండగా కాదు" అన్న నారాయణరావు మాటలే అనంత చెవుల్లో మళ్ళీ మళ్ళీ వినిపించాయి. పడుకుని కళ్ళు మూసుకుంటే అనంత ఆలోచనలు పెళ్ళిమీదకు, సంసారం మీదకు పోయాయి. వెంటనే కామేశ్వరి బిడ్డ గుర్తుకు వచ్చాడు. భయంతో రెండు చేతులూ జోడించి "భగవంతుడా, నన్నిట్లాగే ఏ కష్టమూ తెలియకుండా బ్రతకనియ్యి. ఇంకేమీ అడగను నిన్ను" అని వేడుకుంది.

"అక్క సంగతేమైనా సరే, నా మనసుకు మాత్రం పెళ్ళి, సంసారం సరిపడేలాగున లేవు. రాత్రిళ్ళు, పగళ్ళు వెన్నంటితిరిగే భయంలో నాకు శాంతి వుండదు. ఇంకో మనిషి శాంతి సౌఖ్యాలను నేను పోగొట్టకూడదు" అనుకున్నది. ఆ తర్వాత కొన్ని రోజులు సంబంధాల గొడవలు రాకుండా గడిచిపోయాయి. అనంత ప్రేమ సంగతి మరిచిపోయి చదువుకోవడం మొదలు పెట్టింది.

ఒకనాటి సాయంత్రం ఎవరో నూజెళ్ళనుంచి బందరు పనిమీద వచ్చే మనిషితో రాఘవరావు "తనకు ఒంట్లో బాగుండడం లేదని, వసంతను పంప"మని కబురు చేశాడు నారాయణరావుకు. వెంటనే ప్రయాణమైంది వసంత. "మీరు వెళ్తారా లేక నేను పంపించిరానా వసంతను". అన్నది జానకి భర్తతో. "మెడ్రాసుకే ఒంటరిగా వెళ్తాను కదా అత్తయ్యా, బందరునుంచి నూజెళ్ళకు నాకు తోడు దేనికి" అని ఒంటరిగానే బయలుదేరింది వసంత.

వెళ్ళిన మూడవ రోజునే "నాన్నకేమీ బాగాలేదు, అందరిని రమ్మని" కబురు చేసింది. నారాయణరావు గాభరా పడిపోయాడు. "జానకీ పదండి. త్వరగా ఏవో రెండు గుడ్డలు సర్దు" అన్నాడు.

జానకి గబగబా సూటుకేసులో ముగ్గురి బట్టలు సర్దింది. గదులు తాళం వేసుకుని, ఇల్లు వంటమనిషికి అప్పచెప్పి కారులో వెళ్లారు. కొంతదూరం వెళ్ళాక చప్పున ఏదో స్ఫురించగా కారు వెనక్కి త్రిప్పించాడు నారాయణరావు. ఫ్యామిలీ డాక్టరు శేషాచలం గారింటికెళ్ళి ఆయన్ని ఉన్నపళంగా కారు ఎక్కించుకుని వెళ్ళారు. స్నేహితులు ఒకరినొకరు చూసుకోగానే ఇద్దరి కళ్ళలోనూ నీళ్ళు నిండాయి. డాక్టరు పరీక్షించి నారాయణరావును పిలిచి "ఇంక రెండు మూడు రోజుల కంటే

ఎక్కువ వుండరాకున. జబ్బు తెలియకుండా జీర్ణించిపోయింది. బంధువులకు కబురు పెట్టండి ఒక మంది లక్షణ మేమిటంటే, ఈ జబ్బులో చివరివరకు మాట, చూపు వుంటాయి' అన్నారు.

నారాయణరావు పెగల్చుకుంటూ "ఏం జబ్బంటారు' అనడిగాడు' అది దేనికి లెండి. ఇప్పుడు చెయ్యగలిగినంత చేస్తాం, కాని లాభముండదు' అన్నారు. డాక్టర్లు తిరిగి వెళ్ళి పోయారు.

నారాయణరావు కుర్చీలో కూలబడిపోయి చేత్తో ముఖం కప్పుకున్నాడు. తలుపవతలనుండి అంతా విన్న జానకి భర్త చేతులు పట్టుకుని "ధైర్యం తెచ్చుకోండి. ఆడపిల్లలు బెంబేలు పడిపోతారు' అన్నది గద్గదంగా.

"నారాయణరావ్' అని పిలిచాడు రాఘవరావు. నారాయణరావు స్నేహితుడి పక్కమీద కూర్చొని అతని చేతులు తన చేతుల్లోకి తీసుకున్నాడు. 'ఎందుకిలా పిలిచావ్' అన్నాడు 'నారాయణా నాకెందుకో అనిపిస్తోంది నా ప్రయాణం దగ్గర పడిందని! జీవితంలో కష్టాలు వచ్చింది నాకు, కాని వాటి బరువు మోసింది నువ్వు ఇన్నాళ్ళు బ్రతికి ఏ పని పూర్తిగా చెయ్యలేక మళ్ళీ బరువంతా నీ మీదే వేసి చచ్చిపోవాలంటే కష్టంగా వుంది నాకు' అన్నాడు.

నారాయణరావు స్నేహితుడికి "ఫరవాలేదు బ్రతుకుతావు' అని ధైర్యం చెప్పలేదు. 'నా మీద నమ్మకమున్నది కదరా నీకు! శాంతిగా వుండు. ఏమి చెయ్యాలో చెప్పు' అన్నాడు పొడిగా. "నీవు అనుకున్నంతమంచివాణ్ణి కాదు నేను నారాయణా!' అని తలక్రింద పెట్టుకున్న ఒక పెద్ద కవరు తీసి నారాయణరావు కిచ్చాడు. "దాంట్లో నా చరిత్ర, నా ఆశలు, నాకు తీరవలసిన కోరికలు అన్నీ వున్నాయి. నేను పోయాక దినవారాలయిం తర్వాత ఈ కవరు విప్పి చూడు అన్నీ. అంత వరకుచూడకు. నన్ను క్షమించగలిగితే క్షమించు' అన్నాడు రాఘవరావు.

అతని గొంతు వణికింది. కన్నీరు చెవులమీదగా కారి దిండు తడుస్తోంది. రాఘవరావు స్నేహితుడి చేతులు బలంగా నొక్కుతూ 'అనంతతోపాటు వసంత కూడ నువ్వే దిక్కు! నిర్భాగ్యుణ్ణి! దాని పెళ్లి చెయ్యాలని ఎంత ప్రాకులాడాను? ఒక్క మంచి పని చేసే యోగం నాకు లేక పోయింది ఏ పని పూర్తి గాకుండా నే పోతున్నాను నేను' అన్నాడు ఎవరో తలుపు తట్టినట్లయింది నారాయణరావు చేతిలో కవరను పక్కక్రింద దాచి, స్నేహితుడి ముఖం, కళ్ళు తన ఉత్తరీయంతో తుడిచి, తలుపు తీశాడు. వసంత నిల్చుని వుంది. గుమ్మంలో "ఎవరో రాజమండ్రి నుంచి ఒకామె కొడుకుతో వచ్చారు నాన్నను

"అర్జంటుగా చూడాలంటున్నారు" అన్నది వసంత. "తీసుకురా లోపలకు" అన్నాడు నారాయణరావు.

ఎవరో అప్పు తీర్చడానికి వచ్చినవాళ్ళో, కావలసి వచ్చినవాళ్ళో అయివుంటారనుకున్నాడు నారాయణరావు. వచ్చినావిడకు నలభై ఏళ్ళుంటాయి. తెల్లగా, లావుగా, పొడుగ్గావుంది. ముఖాన నిలువుగా పొడిచిన పచ్చబొట్టు చేతులమీద పచ్చపొడిచిన ముగ్గులు మెడలో బిగుతుగా కంటె, దానికి ఒక జిగిని, రెండు పేటల కాసికాయ గుళ్ళు వున్నాయి చేతులనిండా గాజు గాజులు, ఆకుపచ్చ రంగు గుంటూరు నేతచీర, బిగుత్తైన తెల్లరవిక, బరువైన మెడమీద పడే జుట్టుముడి.

ఆమెను చూచి "ఈ జిల్లా మనిషిలాగ లేదు" అనుకున్నాడు నారాయణరావు. ఆమె లోపలికి రాగానే ఎవర్నీ పట్టించుకోనట్లు పక్కదగ్గరకు వెళ్ళి రాఘవరావు రెండు కాళ్ళమీద చేతులువేసి, అతని పాదాలకు నుదురు కొట్టుకుంటూ ఏడ్చింది రాఘవరావు ముఖం పాలిపోయింది స్నేహితుడివంక, కూతురివంకా చూశాడు. అతని కళ్ళలోని భీతి నారాయణరావుకు అర్థం కాలేదు. ఏమితోచక "పద వసంతా" అని వసంతతో పాటు బైటకు వెళ్ళి తలుపు దగ్గరగా మూశాడు.



"ఏమండీ, మీ స్నేహితుల్ని భోజనానికి పిలుస్తావన్నారు. ఈ పాతచీర కట్టుకుని వడ్డిస్తే మీ ఆవిడ నస కోర, మీవంటి మనిషి అనుకుంటారు."

"అదీ మంచిదేగాని వంటమనిషిని పెట్టుకోగలిగినంత తాహతు వున్నదని అసూయ పడతారు".

---

ధైర్యం తెచ్చుకుని ఆమె ఒక్కసారి రాఘవరావు చేతులు పట్టుకుని "మీ ఉత్తరం చూచి మనసు ఆగలేక వచ్చాను మీరు రావద్దని వ్రాసినా వచ్చాను నన్ను క్షమించాలనండి" అన్నది

"గంగా వచ్చావు, మంచిదయింది నిన్ను రావద్దని వ్రాశానే గాని, నిన్ను చూడకుండానే చచ్చిపోతున్నానని రెండు రోజులనుంచి బెంగగా వుంది. హరి వచ్చాడా, ఇటు పిలువువాణ్ణి" అన్నాడు. హరి

కృష్ణ దగ్గరగా వచ్చి "నాన్నా" అన్నాడు. రాఘవరావు బెదిరిపోయి గంగవైపు చూశాడు. గంగమ్మ "భయపడకండి, వాడికి అన్నీ తెలుసు. ఏమీ దాచకుండా చెప్పాను. మీ వాళ్ళు ఎవరూ ఇక్కడ లేరనే ధైర్యంతోనే పిలిచాడు. వాడిక్కడ ఎవరితోనూ చెప్పడు లెండి మీ కొడుకునని" అన్నది బాధగా.

రాఘవరావు హరి చెయ్యి పట్టుకుని "నన్ను క్షమించరా బాబూ, నీకన్న ముందు పుట్టినవాళ్ళు ఆడపిల్లలు. వాళ్ళు అన్యాయమై పోతారనే భయంతో నిన్ను ప్రపంచానికి తెలియకుండా దాచాను. నీ చేత్తో నిప్పు పెట్టించుకునే అర్హత లేకుండా చేసుకున్నాను. నేను చేసినది తప్పే అయితే, దేవుడుమాత్రం ఇంతకన్నా పెద్దశిక్ష ఏమి విధించగలడునాకు ?" అన్నాడు.

హరికృష్ణ "హక్కు లేకుండా పుట్టినవాణ్ణి, హక్కులు కోరడానికి రాలేదు నేను. మీరు నిశ్చింతగా వుండండి" అన్నాడు పదహారేళ్ళ పసివాడి కంఠలో వయసుకు మించిన బాధ వికృతంగా ధ్వనించింది.

గంగమ్మ తననుతానుసంబాళించుకుని "క్షమించండి నేనిక్కడవుండలేను. మీ రేనుయి పోతున్నా నాకు పట్టనట్టుగా ఉండలేను నేను. బలహీనమైన క్షణాన దుఃఖం పట్టలేక, ఇన్నాళ్ళు కాపాడిన రహస్యం బైటపెట్టేస్తానేమోనని భయంగా వుంది నాకు. ఎన్నోసార్లు నాకు అన్యాయం చేశాననేబాధ మీరు పడుతుండడం చూశాను. ఇవాళ మీ అంత్యఘడియల్లో నేను వచ్చింది నాకు మీరు ఎట్టి అన్యాయం చెయ్యలేదని చెప్పడానికే ! నా నిస్సహాయ పరిస్థితులలో, ఈ సంఘంలో మీరు కాక యింకో మగవాడైతే నా జీవితాన్ని నరకం చేసివుండేవాడు. మీరు దేవుళ్ళు నాకు ! నేను వెళ్తాను. హరి మీ అంత గొప్ప మనసు కలవాడుగా కావాలని కోరుకుంటాను" అని గంగ రాఘవరావు పాదాలు కడసారి స్పృశించి, కొడుకుతో వెళ్ళిపోయింది.

నారాయణరావు లోపలకు వచ్చాడు. స్నేహితుడి పక్కక్రింద ఉన్న కవరు తీసుకెళ్ళి తన పెట్టెలో పెట్టి తాళంవేసి వచ్చాడు రాఘవరావు ముఖం బాగా పాలిపోయింది. కళ్ళు కళతప్పాయి. నారాయణరావు అందరిని పిలిచాడు. వసంతా, అనంత తండ్రికి చెరిఒక వేపూ నిలిచారు. జానకివచ్చి వసంత ప్రక్కన నిలబడింది. నారాయణరావు అనంత ప్రక్కన నిల్చున్నాడు.

రాఘవరావు జానకిని చూసి "అమ్మా వసంత జాగ్రత్త" అన్నాడు. నారాయణరావు చెయ్యి తనచేతిలోకి తీసుకుని "లక్ష్మీ, నారాయణా హరి కృష్ణా" అన్నాడు నిర్జీవమైన చేతిని మెల్లిగా వదిలాడు నారాయణరావు. వసంత తండ్రిపైన పడి రోదించింది. రాఘవరావు దాయాదులెవరో కర్మ చేశారు.

[సశేషం]

# అందం

శ్రీసుభా

'లలితకి గర్వం ఎక్కువ' అనే వారు చాలామంది.

ఈ మాట లలితనేం బాధపెట్టలేదు — ఎప్పుడూ కూడా. లేనివి కల్పించి, అభూత కల్పనలు సృష్టించే మనుష్యుల తత్వానికి భయపడాలిగానీ — వున్నమాట వినవల్సి వచ్చినప్పుడు సిగ్గుపడాల్సింది కనబడదు లలితకి.

నాలుగు సంవత్సరాలుగా లలిత ఈ మాటలు చుట్టాల నోటి వెంటా, స్నేహితులద్వారా వింటూనే వుంది. తను అందగత్తె. ఆ విషయం తన చుట్టూ మనుష్యులు విప్పి చెప్పి, ఆ పైన తన వెనకే గుసగుసల ద్వారా విడమర్చుకుంటూంటే నవ్వొచ్చేది. అలా నవ్వుకుంటూనే వెళ్ళి అద్దం ముందు నుంచుని తనలోకి తను చూసుకునేది. అందం లేనివారికి కూడా ఆకర్షణ ఆపాదించేది వయసు. అలాంటిది తన పాలిట వయస్సు మరింత సోయగాల్ని, సొగసుల్ని తెచ్చిపెట్టింది. నిండుమనస్సుతో తన అవయవాల సొంపుల్ని పొగిడిన విశాల గుర్తొచ్చింది. విశాల పదే పదే పొగిడిన చారెడేసి కళ్ళు, సంపెంగ మొగ్గలాంటి ముక్కు, చిన్ననోరు, సన్నని నడుము, పొడుగూ పొట్టీ కాని ఎత్తు, గుండ్రని భుజాలు ...

లలిత నవ్వుకునేది. అలా నవ్వుకునే లలితకు గర్వం నేర్పింది నిజానికి, స్నేహితులూ కావల్సినవాళ్ళూ మాత్రమే.

తను యెంతటి అందగత్తె అయినా ఆ అందానికి పరమార్థం చాలా గొప్పదనీ, అది తనకో గొప్ప వరమనీ లలిత ఏనాడూ అనుకోలేదు. నిజానికి ఆమె గర్వం స్వకీయమే...

'అలాంటిది లలిత తన అందాన్ని

చూసి జాలిపడుతోంది – ఈవాళ. తన బ్రతుక్కి, తన ఆశలకి అడ్డు తగిలే అందం గురించి పదే పదే విచారపడుతోంది ... తనకి శత్రువుగా మారిన అందం ముందు వోడి పోవాల్సి రావడానికి ఆమెకు అస హ్యంగా వుంది ... ఆ ఆలోచనల తోనే ఆమెకు అందం లేనివారి మీద ఈర్ష్య పుట్టింది ... వాళ్ళ స్వేచ్ఛ తనలో లేదు ... తనకున్నన్ని బాదర బందీలు వాళ్ళకి లేవు ...

సమాజంలో లక్షలాది మను ష్యుల్లో వాళ్లూ వొకరుగా కలిసి మెలిసి జీవిస్తున్నారు తమఆశయాల్ని బాహాటంగా నెరవేర్చుకునేందుకు వాళ్ళకి అవకాశం వుంది.

వాళ్ళు ప్రజాస్వామ్యానికి ప్రతి నిధుల్లా కళ్ళల్లో నవ్వుని విరజిమ్ము కుంటూ, ఒడలికలో స్వాతంత్ర్యాన్ని కనపర్చుకుంటూంటే తను కపట నియంతలా వొదిగి వొదిగి జీవిం చాల్సి వస్తోంది. చుట్టూ విరిసే నవ్వుల నవ్వు ప్రవృత్తుల అంత ర్యాన్ని పసిగట్టుకోలేక తూలి తూలి బ్రతకాల్సి వస్తోంది.

ఈ నిజం తెలిసే రోజుకు లలితకు ఇరవై యేళ్ళు. బి. ఏ. ప్యాసయ్యింది. నాలుగు సంవత్సరాల కాలేజీ జీవితంలో ఆమె నేర్చుకున్న పాఠాలకంటే, జీర్ణించుకున్న విజ్ఞానంకంటె ఎదుర్కొన్న అగ్ని పరీక్షలే యెక్కువ ...

'లలితా నీది పిచ్చెక్కించే అందం – అందుకే కుర్రకారంతా నీ వెంట పడుతున్నారు చూశావాళ్ళే...'

నీ పక్కన నడిస్తే మాకు రికగ్నిషన్ వుండదు లలితా ...'

"ఏమండీ ... మిమ్మల్ని చూసిన తర్వాతే నాకు మన ప్రబంధ నాయికల సౌందర్యంమీద నమ్మకం కుదురుతోంది ..."

"శకుంతల, క్లియోపాత్రా, మెహరున్నిసా వీళ్ళ సౌందర్య కిరణాల్ని మీ అందం పొందు పరుచుకుంది ..."

పొగడ్తలు, పోలికలు, జెలసీలు అన్నీ విందీ లలిత అంతకు మించిన క్రూరత్వం కూడా చూసింది. అది తల్చుకుంటే భయం కలుగుతుంది. ఓ రోజు శారదకోసం వాళ్ళింటికి వెళ్ళింది. ఆ క్షణాన శారద లేక పోవటం లలితకి అగ్ని పరీక్ష అయింది. ఆడదానికోసం, అందం కోసం మొగాడు [illegible] స్వరూపాన్ని తనకు చూపిన ఆ– ఇవాళకూడా, మరో [illegible] కూడా గుర్తుంటుంది శారద తండ్రి వయసున్న లెక్చరర్లు తన్ని చూసి కలవర పడ్డం ఆ పైన చేసే వెకిలి చేష్టలు చూస్తూంటే లలితకు గంగవెర్రు లెత్తినట్టు వుండేది. పిలవకుండా, ఆహ్వానం లేకుండా తమ ఇంటికి వచ్చే ఎందరో మొగవాళ్ళని తను చూసింది. వాళ్ళ కళ్ళల్లో కలిసి, వాళ్ళ అంతరాల్లో నిద్రపోతున్న పెద్ద పులుల్ని చూసిన తర్వాత న




నయించి వారిని పంపించి తనవైపు ఎంతో జాలిగా చూసేవాడు. ఆ చూపు తనకు కన్నీళ్ళని తెప్పించేది

'నువ్వింత అందంగా ఎందుకు పుట్టావు లలితా' అన్న భావం ఆ చూపుల్లో యెన్నోసార్లు చూసింది. తండ్రితో తల్లి రహస్యంగా అన్న మాటలు అనుకోకుండానే ఆమె చెవిని పడేవి

"దానికి చమవావుజేసి పెళ్ళి చెయ్యండి. ఈ వయస్సులో అదలా వీధులంట తిరిగి కాలేజికి వెళ్ళడం బాగోలేదు. అప్రతిష్ట వచ్చిందంటే ఆ పైన ఏ మనుకునీ లాభంలేదు."

కన్నతల్లి దండ్రులకే తన అందం అంకటి అపాయకరమైనప్పుడు ఏం చేసుకోగలదు తనీ అందాన్ని? తనకే సుఖాన్ని యివ్వలేని ఈ అందం తననుంచి దూరమయితే బావుణ్ణు. తన చదువుకు, తన కల

లకు ప్రతిబంధకమైన అందం తను కావాలని కోరుకుందా ?

ఎంతో మంది అందం లేనివారు తమ దురదృష్టానికి బాధ పడ్డం తానెరుగును ... వాళ్ళందరికీ తన బాధలు తెలుసా ? తెలిస్తే అందం గురించి యిలా ప్రాకులాడతారా ? వెళ్ళి వాళ్ళందరికీ తన దురదృష్టం విడమర్చి చెప్పగల్గితే ... ఇలాంటి పరిస్థితుల్లోనే లలిత బి. ఏ ప్యాసయింది ...

'నాన్నగారూ ! నేను యూనివర్సిటీలో జాయిన్ కావద్దాండి ?' అని అడిగింది ... తను చదువుకోవాలి ... తనని వాస్తవ ప్రపంచం నుంచి ఉన్నతలోకాల్లోకితీసుకు వెళ్ళగల్గే చదువుని ఆపుజేసుకోకూడదు. మంచి మనుష్యులకోసం మన చుట్టూ వెదికి, మన కన్నీళ్ళు, మన కష్టాల్ని విప్పి చెప్పుకునే మనుష్యులు దొరక్క నిరాశపడ్డ ప్రతీ మనిషికి ఓదార్పు నిచ్చే వ్యక్తులు పుస్తకాల్లోనే దొరుకుతారు. సాహిత్యంలోనే కన్పిస్తారు. నిత్య జీవితంలో దగాపడ్డ తనలాంటి మనుష్యులకు షేక్స్పియర్, బెర్నార్డ్ షా, ఆస్కార్ వైల్డ్ లాంటివార మిత్రులు.

'ఇంకా కాలేజీ తెరవడానికి వ్యవధి వుందిగా, చూద్దాం లే' అన్నాడు తండ్రి.

లలిత లోపలికి వెళ్ళిపోయింది. లలిత వెళ్ళిపోవడం చూసి రామారావు తండ్రివైపు చూసి అన్నాడు.

'దాన్ని చదివించా లనుకుంటు న్నారా నాన్నా ?'

'ఏం చేస్తాంరా. అది చదువు కుంటాననంటోంది. పైగా దానికి చదువు వస్తోంది.'

'వస్తేవచ్చింది. నా మాట విని పెళ్ళిసంబంధాలు చూడండి దానికి' లోపలినుంచి వచ్చి అంది సీతమ్మగారు.

'అవున్నాన్నా ... లలిత చదివితే నేను చదివేదిలేదు. ఇప్పుడే చెబుతున్నాను. మా యిద్దరిలో వొకళ్ళే చదవాలి.'

'అదేమిట్రా ...'

'మీకు అర్థం కాదు నాన్నా ... ఎక్కడకు వెళ్ళినా నాకు తల తీసేసినట్టుంటోంది ... ప్రతీవాళ్ళూ నన్ను చూసి యెందుకో నవ్వుకుంటూరు ... దాన్ని యేడిపించీ, గేలిచేసి వెనక

తిరిగేవాళ్లు అంతటితో ఆగక నన్ను కూడా హేళన చేస్తున్నారు...'

ఆయన నవ్వాడు...

'అయితే చదువుకుంటున్న ఆడ పిల్లల అన్నలూ తమ్ముళ్ళూ ఇలాగే మథన పడుతున్నా రంటావా.'

'అది నాకు తెలియదు. ఈ కంబైండ్ ఎడ్యుకేషన్ వల్ల ఆడ వాళ్ళకూ మగవాళ్ళకూ సామ రస్యంకన్నా మన దేశంలో అనర్థాలే యెదురవుతున్నాయి. ఎదగని మను ష్యులకు ఆకాశాన మెరిసే అభ్యు దయ పంథాలు వెగటు కల్గిస్తాయి.'

'ఇంతకీ యేమిటిరా నీ ఉద్దేశం' సీతమ్మగారు అడిగింది.

'లలిత చదవడానికి వీల్లేదమ్మా మనం పైవాళ్ళని నిందించేముందు మన వాళ్ళని అదుపులో పెట్టు కోవాలి.'

'ఏమిటి అర్థంలేని మాటలు' గట్టి గానే అన్నాడు విశ్వనాథంగారు.

జవాబు చెప్పకుండానే వీధిలోకి వెళ్ళిపోయాడు రామారావు.

'వీధిలో వాళ్ళ నోళ్ళు నొక్కడం చేతకాక దాన్ని ఆడిపోసుకుంటాడు దేనికి' ఆయన మథనపడుతున్నాడు. సీతమ్మగారు ఆలోచిస్తోంది.

* * *

లలిత యివాళ రోజుకు కూడా బి. ఏ. ప్యాసయిన యువతిగానే వుండిపోయింది. పైకి చదవాలనీ, తన కలల్ని సార్థకం చేసుకుందామను కున్న ఆలోచనల్ని తిరగదోడుకుని- అందుకు ప్రతిఫలంగా విలువయిన కన్నీటిని జారవిడుచుకుంది.

అంతకుమించి మానసికసంక్షోభం యెదుర్కొంది.

ఆపైన మరేం చెయ్యలేక విద్యార్థి దశని వదిలిపెట్టి వివాహిత అయింది.

దానికి కారణం...

లలిత రెండు మూడు రోజుల్లో యం. ఏ. లో చేరాలనుకున్ననాడు జరిగిన సంఘటన యిది.

చేతిలో ఉత్తరం చదవడం ముగించి విశ్వనాథంగారు బరువుగా నిట్టూర్చాడు. మౌనంగా ఆలో చనల గాలివానల్ని యెదుర్కొంటు న్నాడు.

ఆ ఉత్తరం మొత్తం రెండు పేజీలు వుంది... అందులో అక్షరం అక్షరం లలిత అందాన్ని పొగుడుతూ పొగడబడ్డదే... లలిత గురించి వ్యథ పడే హృదయాన్ని చిత్రించాలనే ప్రయత్నం మాటల రూపంలో కన బడింది.

అంతవరకూ విశ్వనాథంగారు అది వ్రాసిన వ్యక్తి అమాయకత్వానికీ నవ్వుకున్నాడు. ఆ సహించు కున్నాడు... కానీ...

ఇంకా వ్రాసివుంది.

'నేను వ్రాసిన వుత్తరం అందిందా... నువ్వు ఈ నిలవాలు

ల్లాంటి అక్షరాలు కూర్చేటప్పుడు నీ చేతి గాజులు చేసిన సంగీత ధ్వనులు వినలేనందుకు బాధగా ఉంది. నువ్వు చీకట్లో నవ్వేతూంటే నాకు మెరుపు మెరిసినట్టు అన్పిం చింది."

లలిత గురించి ఆయనెన్నడూ చెడుగా ఆలోచించలేదు. లలిత నడతమీద ఆయనకు కొండంత నమ్మకం వుంది. అలాంటిది లలిత కన్నవాళ్ళందర్నీ మర్చిపోయి కలలుకన్న కోరికల స్వరూపం ఇదే నని తెలిసినప్పుడు ఆయనహృదయం చితికిపోయింది. కన్నీళ్ళు కళ్ళ నుండి జారిపడక లోలోపలే కెర టాలు వెయ్యసాగాయి.

"లలితా .."

లలిత వచ్చింది. ఆయన తన చేతిలో ఉత్తరం యిచ్చాడు.

లలిత చదువుతోంది. చేతులు వణుకుతున్నాయి. కళ్ళు భయపడు తున్నాయి. గుండె వేగం హెచ్చింది

"ఇదంతా యేమిటి ?"

"అబద్ధం నాన్నా."

"అతనెవరు అతగాడు వ్రాసిం దంతా నిజం కాదంటావా ?"

"నిజంగా నాన్నా. నాకేం తెలి యదు. మీరూ నన్ను నమ్మరా."

సీతమ్మగారూ, రామారావూ లోపలనుంచి వచ్చారు.

సంగతంతా విని సీతమ్మగారు. కన్నీళ్ళు పెట్టుకుంటూనే లలితని నానా మాటలు అంది ... బొమ్మలా చూస్తూ నుంచున్నాడు రామారావు.

ఆ క్షణంలో లలిత అపరాధిని... ఆమె చెప్పింది విని — ఆమె తరఫున వాదించే, సమర్థించే ప్రతినిధులు లేరు ... అందుకే లలిత వోడిపోయి— ఆ యింట్లో వాళ్ళు నెగ్గారు ...

లోపలికి, యింట్లోకి — తన గది లోకి వెళ్ళిపోతూ వంటరిగా వున్న అన్నగార్ని చూసి లలిత అడిగింది.

"నువ్వూ నమ్మటం లేదా — అన్నయ్యా."

రామారావు మాట్లాడలేదు అన్న గారిలా చూశాడు. అంతే.

అందుకే లలిత చదువాగి పోయింది, ఆ రోజు...

ఈ రోజుకు లలిత మామూలు గృహిణి ... పిల్లల్ని కని వాళ్ళని పెంచి పెద్దచేసే తల్లి ...

* * *

చెయ్యని తప్పుకు శిక్షింపబడే వాళ్ళూ, చేసిన తప్పు కప్పి పుచ్చు కుని ధీమాగా బ్రతికేవాళ్ళూ యెంతో మంది మన చుట్టూ వున్నారు ... వాళ్ళని చూడగానే యెవరెవరో నిర్ణయించడం కష్టం. అందుకు తగ్గ సాధనాలు ఈ అధు నాతన యుగంలో మరీ కరువయి పోయాయి. అయితే చరిత్ర వయస్సు పులుముకుని ముందుకుపోయిన్నాడు

కొన్ని కాంగర్భిత నిజాలు బయటు పడక మానవు

లలితలాంటి అసాధారణ సౌందర్య వతి నిద మోసబడి చదువుకునే రోజుల్లో ఎంతో మంది ఆడ లి కళ్ళశారి నుండి తప్పించుకోవడం మనకు మామూలు విషయం. ఆమె చదువుకుని దేశాన్ని ఉద్ధరించినా, లేకపోతే అతి సాధారణంగా బ్రతికినా పట్టించుకునేవాళ్లు లేరు. ఈ రోజుల్లో. సగటు మనిషి కష్ట నిష్ఠూరాలు సంఘం పట్టించుకోదు. ఇది అనాదిగా వస్తున్న ఆచారం.

అయినా లలిత అంటే నాకున్న అభిమానం చేతో, ఆమె ఆవేదన విని నేను బాధపడ్డ మూలంగానో అనుకుంటాను ఎవరికీ చెప్పని రహస్యం యిన్ని సంవత్సరాల తర వాత రామారావు నాకు చెప్పాడు: లలితకు యెవడో ప్రేమ లేఖ వ్రాయడం, ఆమెమీద అభాండాలు వెయ్యడం అన్నీ తను కల్పించిన వేనట ..ఎలాగైనాలలితని పైచదువు చదవనియ్యకూడదనే వుద్దేశంతో తనే ఈ పని చేశాట్ట

'నువ్వు చేసిన పని తప్పుకాదూ? ఆ అమ్మాయిని నువ్వే అన్యాయం చేశావు' అని నేను అడగలేదు అడిగితే అతను చెప్పే సమాధానం నాకు తెలుసు.

'మనం మనిషిని గౌరవించేటంత ఉన్నతికి యెదగలేదు. అందులో ఆడవాళ్ళని, అందమైన వాళ్ళని గౌరవించడం అసలే తెలియదు. సౌందర్యంకోసం ప్రాకులాడే మనిషి నిజంగా ఆ సౌందర్యం ఎదురయితే తట్టుకోలేడు. దానికాంతికి విలవిల్లాడి పోతాడు. పైగా కాలేజీలనే బందిఖానాల్లో సౌందర్యం బ్రతకలేదు... అందాన్ని పూజించే అర్హత కోసం మనిషి ప్రయత్నించి అందులో నెగ్గే వరకూ మన దేశంలో ఉమ్మడి చదువులు ఉపయోగపడవు... అంత వరకూ ఇలా మరో మార్గాన వాటికి పరదాలు వేయడం తప్పించి మరోదారి లేదు' అంటాడు...

నాకు దుఃఖంచేత కన్నీళ్లు తిరిగాయి. సౌందర్యం అగౌరవించబడేచోట పురోగమనం కుంటుపడుతుంది సౌందర్యాన్ని గుర్తుపట్టిపోరతులివ్వలేని మనుష్యులు రాళ్ళుగా మారిపోతారు. దేవుడా!నా దేశాన్ని రక్షించు. మేం గుర్తించలేదని మువ్వు సృష్టించిన సౌందర్యాన్ని నువ్వే కబళించకు. అదే నే కోరేది...

* * *

అందమైన వాళ్ళం కాదని బాధ పడేవారికి మేల్కొలుపు ఇస్తూనే— మరో పిడ అందమైన వాళ్ళకి చిన్న నిట్టూర్పు కలిచాలని ఈ కథ ఉద్దేశంకాదు—(రచయిత)

***

వానోవారా

వానోవారా

వానోవారా

# వానోవారా

మానవ చరిత్రలో కల్లా గొప్ప ప్రేలుడు ఇండొనీషియా దీవుల లోని క్రకటోవా వద్ద జరిగిందని క్రిందటి నెల 'జ్యోతి' లో వ్రాశాను. అది 1883 ఆగస్టు 27 వ తేదీన జరిగింది.

దాని తరవాత దానితో దాదాపుగా పోల్చదగిన ప్రేలుడు విధ్వంసం 1908, జూన్ 30 వ తేదీ ఉదయాన సైబీరియాలోని వానోవారా అనే చోట జరిగింది.

క్రకటోవా వద్ద అగ్ని పర్వతం బ్రద్దలైంది. ఈ సంగతి అనాడే అందరికీ తెలుసు.

కాని, వానోవారావద్ద ప్రేలుడు ఎందుకు జరిగిందో ఈ నాటికీ విచిత్ర రహస్యంగానే ఉండిపోయింది. అనేక మంది శాస్త్రజ్ఞులు అనేక విధాలుగా ఊహాగానాలు చేశారు. చాలమంది చెప్పేదేమిటంటే — ఒక పెద్ద ఉల్క భూమిని ఢీ కొట్టింది. కొందరు ఒక చిన్న తోకచుక్క భూమిమీద పడి వుండవచ్చునని చెబుతారు కాని 1959 లో ఒక సోవియట్ శాస్త్రజ్ఞుడు ఇదేదీ కాదని, ఇతర గ్రహాలలోని వారు హైడ్రోజన్ బాంబును ప్రయోగించడమో, లేక వారు ప్రయాణం చేస్తున్న వ్యోమ నౌక భూమి మీద పడి బ్రద్దలై పోయిందనో సిద్ధాంతం చేశాడు.

కాని, ఈ సిద్ధాంతాన్ని ఎవరూ అంగీకరించడం లేదు ఒక పెద్ద ఉల్క ఏదో పడివుండాలనే చాలా మంది విశ్వసిస్తున్నారు

ఉల్కలు ప్రతి రోజూ, ప్రతి క్షణం, పగలు, రాత్రి కూడా పడిపోతూనే వుంటాయి. పగటి పూట మనకు అవి కనిపించవు రాత్రిళ్ళు నిర్మలాకాశంలో అవి నక్షత్రాలు రాలిపడుతున్నట్టుగా అమిత వేగంతో పడిపోతాయి.

కాని, అవి మామూలుగా భూమి మీద పడవు. అవి తోకచుక్కల నుంచి విడిపోయిన రాతి ముక్కలో, ఇనప ముక్కలో అయి వుంటాయి. భూమి వాతావరణంలో ప్రవేశించగానే అవి భస్మమైపోతాయి కాని, ఎప్పుడైనా చెదురుగా బాగా చిన్న ముక్కలు భూమిమీద పడవచ్చు. అయితే, ఎప్పుడోగాని, అవి సాధారణంగా జనం నివసించే ప్రాంతాల్లో

# వైజ్ఞానిక విచిత్రాలు  శేఖర్

పడవు. అందుకనే మనం బ్రతికి పోతున్నాము తరుచుగా పట్టణాల మీద పడేట్టయితే ఈ పాటి కెప్పుడో ప్రాణికోటి నశించి పోయేది

ఇంతకీ, సైబీరియాలో వానోవారాలో పడిన ఉల్క చాలా పెద్దది. కొన్ని వేల టన్నుల బరువుంటుందని కొందరు, కొన్ని లక్షల టన్నులని కొందరు ఊహిస్తున్నారు. సెకండుకు 45 మైళ్ళ వేగంతో వచ్చి అది పడి ఉంటుందట..

చాల కాలం వరకు సైబీరియన్ ఉల్కాపాతం గురించి ఎవరికీ వివరాలు తెలియరాలేదు. 1930-31లో రష్యాలో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడిన పదమూడేళ్ళకి ఒక సోవియట్ శాస్త్రజ్ఞుడు— అయనపేరు ప్రొఫెసర్ కులిక్— ఆ ఉల్కాపాత ప్రదేశాన్ని పరిశీలించడానికి బయల్దేరాడు. కాని, అడవులు దట్టంగా పెరిగిపోయి, నేలంతా చిత్తడిగా వుండి ఆ ప్రదేశాన్ని చేరుకోవడం కష్టమైంది. అది ఎక్కడుందో కనుక్కోవడం కూడా కష్టమైంది.

చివరికి, విమానాలనుంచి తీసిన ఫొటోల సహాయంతో ఆ ప్రదేశాన్ని కనుక్కొని ఎలాగైతేనేం పదమూడు నెలల తరవాత ప్రొఫెసర్ కులిక్ బృందం వానోవారా ప్రాంతాన్ని చేరుకుంది.

ఆ ప్రాంతంలో నివసిస్తున్న ప్రజలలో కొంత మంది 1908లో జరిగిన విధ్వంసాన్ని ప్రత్యక్షంగా చూసిన వారు అప్పటికింకా బ్రతికే ఉన్నారు. వారిని ఇంటర్వ్యూ చేసి, అక్కడ కొంత, ఇక్కడ కొంత సమాచారం సేకరించి మొత్తానికి ప్రొఫెసర్ కులిక్ చాలా వివరాలు సేకరించాడు.

ఈ ప్రత్యక్ష సాక్షులు చెప్పిందాన్ని బట్టి — వానోవారాకు నైఋతి దిశనుంచి ఒక పెద్ద అగ్నిగోళం విసురుగా వచ్చింది. దాని కాంతి సూర్య కాంతిని మించి ఉంది అది భూమిని తాకి బద్దలై భయంకరమైన ధ్వని వినబడింది ఏ మహా రాక్షసుడో భూమిమీద తన్నినట్లు భూమి కంపించింది.

40 మైళ్ళ దూరాన నిలబడ్డ ఒక మనిషికి చొక్కా దాదాపు అంటుకుంది ఒళ్ళంతా కాలినట్లయింది. చప్పుడుకు ఏడడుగుల అవతల ఎగిరిపడ్డాడు. అతని ఇంటి కిటికీలు విరిగిపోయాయి ఇంటి ఎదుట నేలనుంచి పెళ్ళలు ఎగిరి పడ్డాయి.

ఏడుమైళ్ళ దూరంలో 1500 రెయిన్ డీర్లు మేత మేస్తున్నాయిట. అవి భస్మమై మాయమైపోయాయి.

మూడువందల మైళ్ళ దూరంలో ట్రాన్స్ - సైబీరియన్ రైల్వేలో రైలులో ప్రయాణం చేస్తున్న ఒకడు పెద్ద ధ్వని వినబడిందని, భూమి కంపించిందని చెప్పాడు.

ఇంకో వైపున 300 మైళ్ళ దూరంలో గుర్రాలమీద వున్న మనుషులు ఆ అదురుకు కిందపడ్డారు.

600 మైళ్ళ దూరంలోని టురోగాన్స్క్ లో నివసించే ప్రజలు దూరాన ఫిరంగులు పేలుతున్నట్టు ఏదో ధ్వని విన్నారు.

వానొవారా ప్రాంతంలో నివసించే ముగ్గురు ప్రత్యక్ష సాక్షులు ...ము పన్నెండు మైళ్ళ ఎత్తు, ...లు వెడల్పుగల అగ్ని స్తంభం ఒక ...న్ని చూసినట్టు, తరవాత అది ...డుగు ఆకారంలో పొగగా మారి ...యి 50 మైళ్ళ ఎత్తుకు లేచినట్టు ...ప్పారు.

ఇలాగే ప్రొఫెసర్ కులిక్ చాలా వివరాలు సేకరించి ప్రచురించాడు. ఇప్పటికీ వానొవారా ప్రాంతంలో ... నుంచి 150 అడుగుల వ్యాసం, ... నుంచి 12 అడుగుల లోతుగల ...తులు కొన్ని వందలు కనబడ...యి భూమి ముఖంమీద అవి ...ఫోటకం మచ్చల్లా వుంటాయి.

80 చదరపు మైళ్ళ విస్తీర్ణంలో ఒక్క చెట్టు కూడా కనబడదు. నేలంతా మాడిపోయి ఉంటుంది. రెండువేల చదరపుమైళ్ళ విస్తీర్ణంలో 80 లక్షల చెట్లు కాలి, కూలిపోయిన గుర్తు లున్నాయి.

ఇది జరిగి సరిగా (1908 జూన్ 30) 59 ఏళ్ళయింది. ఈనాడది ఉల్కా పాత ఫలితమని చాలామంది అంగీకరిస్తున్నారు. కాని, ఆ నాడు ఆ సంగతి ఎవరికీ తెలియలేదు. ఉన్నట్లుండి ఆనాటి ఉపయాన షాక్ తరంగాలు భూమిని రెండుసార్లు చుట్టి వచ్చాయి. రెండు రాత్రులు వరసగా చీకటి పడలేదు. సాయంకాలాలప్పుడు చాలా రోజులపాటు సూర్యుని అస్తమయ కాంతులు ఎర్రగా, ఆకుపచ్చగా, పసుపు పచ్చగా గోచరించి ప్రపంచ ప్రజలను విస్మితులనుచేశాయి ఎందుకో ఎవ్వరికీ తెలియలేదు.

రాత్రిపూట మబ్బులులేని నీలాకాశంలోకి చూస్తుంటే అన్ని లక్షల నక్షత్రాల మధ్యనుంచి ఒక ఉల్కా తారాజువ్వలా దూసుకుని ఈ మూల నుంచి ఆ మూలకు రివ్వున పోయి మాయమైపోతున్న దృశ్యం చూడ్డానికి ఎంతో బావుంటుంది. కాని, మన అదృష్టవశాత్తు అది గాలిలోనే భస్మమై పోతుండబట్టిగాని, జనావాస ప్రాంతాల్లో పడితే ఇంకా ఏమన్నా వుందా ?

***




# "పూలరంగడు" పూలబాట

"పూలరంగడు"కు కొత్త ప్రత్యేక నిర్వచనమిచ్చే చిత్రం అన్నపూర్ణావారి "పూలరంగడు"

మేలో ఊటీలో తీసిన ఔట్ డోర్ ఘట్టాలకు జూన్ లో మద్రాసు భరణీలో సంభాషణ శబ్దాలు జోడించి, ఆ తదుపరి ఇంకొంత ప్యాచ్ వర్క్ సాగించి, జులై మాసాంతంలోనో, ఆగస్టు ఆరంభంలోనో థియేటర్ల తలుపులు తట్టనున్న "పూలరంగడు" పాత్రలు తెలుగు వారికి మరింత దగ్గరైనవి, తెలుగు సంగీత అభిమానులకు మరింత మధురమైన పాటల బాటలు వేస్తుంది.

సాధారణంగా పూలరంగడు అనగానే రెండు చేతులా పది వ్రేళ్ళా డబ్బు ఖర్చుపెట్టి జల్సాగా తిరిగే "పూల" రాజు, "రంగు"ల రాజు అనే అభిప్రాయం ప్రజా సామాన్యంలో వుంది.

కాని ఈ పూలరంగడు నీతిగా నిజాయితీగా బ్రతికేవాడు, కష్టాలు వస్తే క్రుంగిపోక, ఎవరికీ తల వంచక నిటారుగా సూటిగా సాగిపోయేవాడు.

గుర్రం బండి తోలుకు బ్రతికే పూలరంగడు తత్వం పాట, మాట, బాట..

"నీతికి నిలబడి నిజాయితీగా వదరా ముందుకు వదరా."

"తాతల తండ్రుల ఆర్జన తింటూ జల్సాగా నువ్వు తిరగకురా

"కండలు కరగగ కష్టంజేసి తల వంచక జీవించుమురా,

"పూలరంగడిగా వెలుగుమురా"

"పూలరంగడు" లో తొమ్మిది పాటలున్నాయి. ఐదు కొసరాజు, మూడు నారాయణరెడ్డి, ఒకటి దాశరథి వ్రాశారు.

కథలో, కథనంలో, తారల కళలో కొత్తదనం ఉట్టిపడే ఈ చిత్రంలో సంగీతం ఒక హైలైట్ అని తెలుస్తున్నది.

భానూప్రకాష్ అనే కొత్త విలనును ఈ చిత్రం పరిచయం చేస్తున్నది. వయసును మించిన ప్రతిభ చూపిన ఈ నటుడు ఈ చిత్రంలో గుమ్మడి సరసన నిలబడి నటించవలసి వచ్చింది; నిలిచారు కూడా.

మోహన్‌రాజు అనే గాయకుని కూడా ఈ చిత్రం పరిచయం చేస్తున్నది. ఈయనా, సుశీల కలసి పాడిన పాటను శోభన్‌బాబు, విజయనిర్మలలపై చిత్రీకరించారు.

భానూప్రకాష్ నటనపట్ల నిర్మాత సంతృప్తి ప్రకటించారు. మోహన్ రాజు కథా రాజులకే (హీరోలకే) పాడే రోజులు దూరంలో లేవన్నారు.

ముప్పాళ రంగనాయకమ్మను సినిమా సంభాషణల రచయిత్రిగా అన్నపూర్ణా సంస్థ పరిచయం చేస్తున్నది.

తెలుగు మనసుల తియ్యదనం



అన్నపూర్ణావారి పూలరంగడు" చిత్రంలో శోభన్‌బాబు, విజయనిర్మల



అన్నపూర్ణావారి "పూలరంగడు" చిత్రంలో
జమున, నాగేశ్వరరావు

తెరపై కెక్కించింది శ్రీ ఆదుర్తి సుబ్బారావు. ఆయనకు నేత్రం సెల్వరాజ్; నేస్తం (సహకార దర్శకుడు) రెడ్డి; సంగీత సారధి ఎస్. రాజేశ్వరరావు; కుదింపు కళా వారధి టి. కృష్ణ; దృశ్య నిర్మాత జి. వి. సుబ్బారావు.

ఏ. నాగేశ్వరరావు, జమున, గుమ్మడి, నాగయ్య, శోభన్‌బాబు, విజయ నిర్మల, పద్మనాభం, చం, గీతాంజలి, భాను ... కాశ్ల అభినయ కళకు అన్నపూర్ణ అయినది అన్నపూర్ణా పిక్చర్స్. చిత్రరాజధాని హైదరాబాద్.

## ఆస్ట్రేలియాలో 3 అంతస్తులు

సిడ్నీలో జరిగిన అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో జగపతి "అంతస్తులు" ప్రతినిధులు వి రాజేంద్రప్రసాద్, ప్రధాన అక్కినేని నాగేశ్వరరావు పాల్గొన్నారు.

జూన్ ఐదవ తేదీన వీరు మద్రాసు నుంచి బయలుదేరి సింగపూర్ మీదుగా విమానంలో ఆస్ట్రేలియా వెళ్ళారు. అక్కడ దాదాపు రెండు వారాలు వుండి మద్రాసు వచ్చారు.

ఆస్ట్రేలియాలో జరిగింది పోటీ రహిత చిత్రోత్సవం. అనగా ఉత్తమ ..., నటన మొదలైనవాటి ఎన్నిక లేదన్న మాట.

భారతదేశం నుంచి 'అంతస్తులు', సత్యజిత్ రాయ్ "నాయక్" పంపారు

"అంతస్తులు" ను '300 అడుగులకు కుదించారు. ఇంగ్లీషు సబ్ టైటిల్స్ మద్రాసులో వేశారు. ఇది వరకు వీటిని బైరూట్‌లో ప్రింటు

చేసేవారు. అందువల్ల మనకు బోలె డంత విదేశీ మారక ద్రవ్యం ఖర్చు అయ్యేది. మద్రాసులో సబ్ టైటిల్సు వేయడం వల్ల బోలెడంత విదేశమారక ద్రవ్యం ఆదా అయింది. మన టెక్నీషియన్‌లు విదేశ టెక్నీషియన్‌ల ముందు ఏ మాత్రం తీసి పోరని రుజువైంది కూడా.

జూన్ నాల్గవ తేదీన మద్రాసు అశోకా హోటలులో వాణీ ఫిలిమ్సు డిస్ట్రిబ్యూటర్సు వారు "అంతస్తులు" ప్రతినిధులకు వీడ్కోలు ఏర్పాటు చేశారు. నగరంలోని ప్రముఖులు ఎందరో హాజ

ద్ర పభా సదులకు

చెప్పారు.

## స్ట్రేలియా : అంతస్తులు

పత్రికల తరపున శ్రీ బొమ్మకంటి సుబ్బారావు మాట్లాడుతూ ఆస్ట్రే లియా అంతస్తులు మూడు అన్నారు. క్రీడల అంతస్తు ఒకటి, ఆహార వ్యవ సాయ అంతస్తు ఒకటి, ఇప్పుడు సినిమా అంతస్తు ఒకటి అనిఅన్నారు.

మొత్తానికి "అంతస్తులు" ఆస్ట్రే లియా వెళ్ళడంతో దక్షిణ భారత సినిమారంగం అంతస్తు పెరిగిందనే చెప్పక తప్పదన్నారు.

## నాల్గవ అంతస్తు : రాజేంద్రప్రసాద్

నిర్మాత వి. రాజేంద్రప్రసాద్ తన ప్రసంగంలో యిలా అన్నారు :

అతి సులభ పద్ధతిలో అమితమైన సత్ఫలితాలతో "అంతస్తులు" సబ్ టైటింగ్ మద్రాసులోనే చేసి విదేశ మారకద్రవ్యం ఆదా చేశాం. మనం సాధించిన అంతస్తు మన పరిశ్రమకే గర్వకారణం.

మా "అంతస్తులు" ఆంధ్రప్రదేశ్ బంగారునంది సంపాదించింది. భారత ప్రభుత్వ రజత పతకం గెలుచుకొంది. బొంబాయి పత్రిక ఫిలింఫేర్ అవార్డు సాధించింది. ఆస్ట్రేలియా నాల్గవ అంతస్తు.

ఇందుకు నిర్మాతగా నాతో సహకరించిన యూనిట్ సభ్యులందరికీ కృతజ్ఞత. భారత ప్రభుత్వానికీ ఇతర ప్రముఖులకు వందనాలు.

## మేల్కొన్న ఆస్ట్రేలియా : అక్కినేని

అక్కినేని నాగేశ్వరరావు తమ ప్రసంగంలో ఇలా అన్నారు :

మేము ఆస్ట్రేలియా వెళ్ళడం వల్ల అనేక దేశాల ప్రతినిధి వర్గాలను కలుసుకోవడ వల్ల, అనేక దేశాల చిత్రాలు చూడడంవల్ల దేశ దేశాల నిర్మాణ పద్ధతులు కథా కథన విధానాలు తెలుసుకొన గలుగుతాము. ఆ మేరకు భారత ఫిలిం పరిశ్రమకు ప్రయోజనం కలిగించ గలమనే నా నమ్మకం.

## అణా పైసలుకాక రేపు చూడాలి : మధు

"అంతస్తులు" దర్శకుడు వి. మధు సూదనరావు విదేశ చలన చిత్రోత్స

వాలకు ప్రతినిధులను పంపడంలో జరుగుతున్న చిత్ర విచిత్రాలు జన లోకం తెలును కొనదగు నంటూ ఇలా వివరిం చారు.

ఆస్ట్రేలియాలో క్రిందటి సంవత్సరంలో కూడా అంతర్జాతీయ చలనచిత్రోత్సవం జరి గింది. సత్యజిత్‌రాయ్ 'చారులత' పంపారు.

ఈసారి 'అంతస్తులు' ప్రతినిధి వర్గాన్ని పంపు తారా లేదా అన్నది చివరి క్షణం వరకు సందిగ్ధావస్థలోనే వుంది.



గౌరీ ప్రొడక్షన్స్
దేవుని గెలిచిన మానవుడు" లో
కాంతారావు, వాణిశ్రీ

విదేశ మారక ద్రవ్యం లేదని భారతప్రభుత్వంఅన్నది. ఆస్ట్రేలియా ప్రదర్శనంవల్ల మనకు లభించే విదేశ మారక ద్రవ్యం ఏపాటిదని ఢిల్లీ ప్రశ్నించింది కూడా.

బైరూట్‌లో కాక మద్రాసులో విశిష్టంగా సబ్ టైటిలింగ్ చేసి బోలె డంత విదేశ మారక ద్రవ్యం ఆదా చేసినట్లు భారత ప్రభుత్వ సమాచార శాఖడిప్యూటీ సెక్రటరీ శ్రీ ఖన్నాగు చెప్పి ఒప్పించాము అయన శ్రీ జగ్గయ్య వంటి పార్లమెంట్ ప్రముఖుల కృషితో మద్రాసు సబ్ టైటిలింగ్ ఉజ్వల భవిష్యత్తు నిరూ పించే సరికి ఢిల్లీయే మన ప్రతినిధి వర్గాన్ని పంపుతున్నది.

అయినా ప్రతి విషయాన్ని ఈ రోజు దృక్పథంతోనే చూచి అణా పైసలతో లెక్క కట్టి ఆందోళన కరమైన నిర్ణయాలు చెయ్యరాదు.

ఈ రోజు అంతసులు' సబ్ టైటిలింగ్ రేవటినుంచి విదేశ మారక ద్రవ్యం ఆర్జించినా ఆర్జించవచ్చు. లేదా ఇతర విధాలుగా సహాయ పడినా సహాయ పడవచ్చు. ఏమి విదేశ మారకద్రవ్యం ఆర్జిస్తారని క్రీడా ప్రతినిధి వర్గాలను విదేశాలకు పంపు తున్నారన్నది నా ప్రశ్న.

'అంతస్తులు' నిర్మాత శ్రీ వి.

రాజేంద్రప్రసాద్‌కు జపాన్ సంస్థల నుంచి లేఖలు వచ్చాయి. మీ కుటుంబ చిత్రం మాకు చూపిస్తే జపాన్‌లో ఆడిస్తామన్నీ, టెలివిజన్‌లో చూపిస్తామని వారన్నారు. ఆ విధంగా విదేశ మార్కెట్‌ను మనం పట్టవచ్చు; కొట్టవచ్చు భారత ప్రభుత్వం దూరదృష్టి ప్రదర్శించినందుకు అభినందనలు.

# చలనచిత్ర వార్తలు

## అంతా కొత్తతారలు

### చిత్రం ప్రత్యేక విశేషాలు

రవి ప్రొడక్షన్స్ వారు అంతా కొత్త నటీనటులతో నిర్మిస్తున్న "గొప్పవారి గోత్రాలు" జూన్ మొదటి రెండు వారాలలో కూడా కోనసీమలో కెమెరా దర్శనం చేసుకొన్నది. ముఖ్య పాత్రధారులు ఔట్‌డోర్ షూటింగ్‌లో పాల్గొన్నారు.

ఈనాటి సమాజంలో పెద్దల అసలు రంగులు తెలుపు నలుపులలో తెరపై తెలిపే ఈ చిత్రం విశేషాలు కొన్ని దిగువ నుదహరిస్తున్నాము.

రాజకుమార్ (కథానాయకుడు) ఒక సామాన్య సంసారంలోని యువకుడు. అమాయకుడు తన్ను నమ్మిన ఘరానా వ్యక్తుల ఆంతర్యం తెలియక వారు చెప్పినట్లు చేస్తాడు. సంఘం దృష్టిలో నేరస్థుడు. రాధతో స్నేహం ఏర్పడుతుంది. మనిషిని మార్చు తుంది. ఘరానా వ్యక్తుల ఆగ్రహానికి గురి అవుతుంది. తుదకు చట్టం దుష్టరక్షణ, శిష్టశిక్షణ చేస్తుంది.

తారల పరిచయం: కుమారి ఇందిర: బెంగుళూరు వాస్తవ్యురాలు. ప్రసిద్ధ నర్తకి కథానాయకి.

శేష గిరిరావు: పట్టభద్రుడు ఆకాశవాణి అనౌన్సర్‌గా పని చేశారు. గుంటూరు వాస్తవ్యుడు కథానాయకుడు.

ప్రభాకర్: హాస్య నటుడు. నెల్లూరు వాస్తవ్యు

లక్ష్మి: హాస్యనటి. విజయవాడ వాస్తవ్యురాలు

రాజబాబు: దుష్టపాత్రధారి. నరసాపురం వాస్తవ్యుడు

సురేఖ: వెన్నెల విసనకర వేషం ధరించారు. ప్రొద్దుటూరు వాస్తవ్యురాలు

గౌతమ్, సుందర్‌రావు (నెల్లూరు), భానుప్రసాద్ (బందరు) జి. ఎస్. ఆర్ మూర్తి (ఇం రు) స్వల్ప భూమికలను ధరిసు రు

జూలైలో నిర్మాణం పూర్తయి ఆగస్టులో చిత్రం విడుదల కావచ్చు.

సాంకేతికవర్గ వివరం- నిర్మాత: మ గం రా దర్శక పర్య వేక్షణ: చాణక్య ... ఎ. ఎల్ ... పా రా కథ: వేణు. సంభాష ... సటి సంగీతం: బ్రహ్మానందం (రవి) కెమెరా: ...న్నయ్య. కళ: రంగారావు.

## రామారావు కొత్త సాంఘికం

విశ్వశాంతివారి "నిలువు దోపిడి" షూటింగ్ జూన్ 11వ తేదీన మద్రాసు వీనస్ స్టుడియోస్‌లో ప్రారంభమైంది. శరణాలయం సెట్ లో నిర్వహణాధికారిగా నాగయ్య, శరణాలయంలో పెరిగి స్వయం కృషికి బయలుదేరుతున్న అన్నదమ్ములుగా రామారావు, కృష్ణ మొదటి షెడ్యూలులో నటించారు. కథ, సంభాషణలు సమకూర్చింది టి వి మహారథి. ఇది సాంఘిక వ్యంగ్య ప్రధాన చిత్రం. దర్శకుడు: సి ఎస్ రావు. నిర్మాత: యు విశ్వేశ్వరరావు. సంగీతం కె వి. మహదేవన్. కళ కృష్ణారావు. ఛాయాగ్రహణం జి కె రాము.

## పురుషుల సభకు జమున అధ్యక్షురాలు

జూన్ ఏడవ తేదీన మద్రాసు చిల్డ్రన్స్ థియేటర్‌లో ఇండో-సోవియట్ సాంస్కృతిక సంఘం వారు సోవియట్ ఫిలిం ప్రతినిధి వర్గానికి సన్మానసభ జరిపారు. సినీతార జమున అధ్యక్షత వహించారు. సభా నిర్వాహకులు అందరూ పురుషులే. సభికులలో నూటికి 90 మంది పురుషులే అయినా జమున నదురు బెదురు లేక కార్యక్రమాన్ని జయప్రదంగా నిర్వహించారు. "సెరోయాలా" అనే బాలల చిత్రం దర్శకుని, ముఖ్య నటుని ఆమె సభా సదులకు పరిచయం చేశారు.



శ్రీ లక్ష్మీనారాయణ ప్రొడక్షన్స్ వారి "చిక్కడు, దొరకడు"లో విజయలలిత, ఎన్. టి. రామారావు

## పాండవులతో కృష్ణుని వాదం

తారకరామా పిక్చర్స్ వారి "శ్రీకృష్ణావతారం" లో మరో షెడ్యూలు ఈ సంచిక వెలువడే సరికి పూర్తి అవుతుంది. ఆగస్టుక విడుదలకు సిద్ధం కాగలదు. ఆ మధ్య విజయా స్టుడియోస్‌లో కృష్ణరాయబారం తీసినప్పుడు కృష్ణుడు భీముడు (అర్జా జనార్దనరావు), అ... భారతి(శ్రీ), అర్జునుని (రామకృష్ణ) కల్పించిన ఘట్టం, వారిలో భీముడు ధర్మజుని (మిక్కిలినేని) ... ఉద్రేకాలు ... ఘట్టం మొదలైనవి ...

కృష్ణుడు రామారావు దర్శకుడు కమలాకర కామేశ్వరరావు నిర్మాత పుండరీకాక్షయ్య.

## పి. ఎస్. ఆర్. పిక్చర్స్ జానపదం షెడ్యూల్స్

పి ఎస్ ఆర్. పిక్చర్స్‌వారి విప్లవాత్మకమైన సెంటిమెంటల్ జానపదం ట్రీట్‌మెంట్ జూన్ మధ్యంలో



శేఖర్ ఫిలిమ్స్ "భామా విజయం"లో దేవిక

సిద్ధమైంది టి పి మహారథి సంభాషణలు వ్రాస్తున్నారు దర్శకుడు గిడుతూరి సూర్యం నిర్మాత పింజల సుబ్బారావు జులై ద్వితీయార్ధంలో షూటింగ్ ప్రారంభించి నెలకు ఒక పక్షం వంతున చిత్రీకరణ సాగించి నాలుగు నెలలలో దృశ్య దశ పూర్తి చెయ్యాలనేది యూనిట్ సంకల్పం ఈ సంచిక వెలువడేసరికి తారా, సాంకేతిక వర్గాల ఎన్నిక పూర్తి అవుతుంది.

## రామారావు కార్యక్రమం

ఎన్ టి రామారావు ప్రస్తుతం ఎన్ ఏ టి అండ్ రామకృష్ణ కంబైన్స్‌వారి "చంద్రగుప్త" స్క్రిప్టు పనిలో నిమగ్నులై వున్నారు తను నటించే సెట్లుపై కూడా ఉచయిత సముద్రాల రామానుజాచార్యతో సంభాషణల గురించి చర్చిస్తూ వున్నారు, కలం దర్శకత్వం వహిస్తున్నారు ఈ చరిత్రాత్మక చిత్రాన్ని చరిత్రాత్మకంగా నిర్మించాలని అయన సంకల్పించారు తనే ట్రీట్‌మెంట్ చాలా పకడ్బందీగా వ్రాశారు చంద్రగుప్తుడు చాణక్యుడు రెండు భూమికలనూ తనే నిర్వహించే పత్రిక సంకల్పం యింకా కన్పిస్తున్నది

## నాగేశ్వరరావు కార్యక్రమం

జూన్ ఆరవ తేదీన ఢిల్లీలో "అంతస్తులు" ప్రదర్శించినప్పుడు హర్షామోదాలు వ్యక్తమైవట్లూ, గంభీర, వినోద ఘట్టాలు రెండింటి



ఇంకా



ఇందిరా రమణావారి "సత్యమేజయం"లో
ప్రసన్నలక్ష్మి, శోభన్‌బాబు

లోను నాగేశ్వరరావు సముద్రజ్ఞతో నటించడం మెచ్చుకోడినటూ మద్రానుకు ఉత్సవ నిర్వాహకులు కేబుల్సు పంపారు.

జూన్ మూడవ వారంలో నాగేశ్వరరావు మద్రాను తిరిగి రాగానే "పూలరంగడు"లో ఉదకమండలంలో తీసిన సన్నివేశాలకు తన వాయిస్ డబ్ చేస్తారు విక్రమ్‌వారి కలర్ చిత్రంలో నటిస్తారు అన్నపూర్ణా వారి క్లయిమాక్స్ ఘట్టాలలో పాల్గొననలసి వుంది వి ఏ పి "బ్రహ్మచారి" కూడా ఈయనకోసం ఎదురుచూస్తూ ఉంటాడు చక్రవర్తి చిత్రంపై కూడా ఆదుర్తితో కలసి ముందడుగు వేస్తారు.

## జగ్గయ్య కార్యక్రమం

"కీలుబొమ్మలు"తో అధిక ప్రపంచం చూచి వచ్చిన కె. జగ్గయ్య ఈ సంచిక వెలువడేసరికి పశ్చిమ జర్మనీలో వుంటారు.

పార్లమెంట్ సభ్యుడు శ్రీ జగ్గయ్య బెర్లిన్‌లో జరిగే అంతర్జాతీయ చలన చిత్రోత్సవానికి అహ్వానించబడి, వెళ్ళారు పశ్చిమ జర్మనీలోని చారిత్రక, సాంస్కృతిక క్షేత్రాలను కూడా ఆయన సందర్శిసారు.

జగయ్య నటించిన హైదరాబాద్ మూవీస్ వారి "అర్ధరాత్రి" యింకా విడుదల కావలసి వుంది. మొత్తం మీద ఇప్పుడు జగ్గయ్య జగత్తుకు రాజధాని మద్రాను, హైదరాబాద్‌ల కంటె ఢిల్లీయే.

## కృష్ణ కార్యక్రమం

అదుర్తి 'తేనె మనసులు' తారా బృందం అందరిలోకి తీజీగా వున్న వ్యక్తి కృష్ణ టీన్ జెన్స్‌లో ఈయనకు పలుకుబడి ఎక్కువనే భావం ప్రస్తుత కొత్త ప్రతిపాదకులకు 'సారీ ప్లీజ్' అని సైలెంట్‌గా చెప్పే స్థితికి వచ్చారు 'గూఢచారి 116' తమిళంలోకి డబ్ చేయబడింది ఫైటింగ్ చిత్రాల నిర్మాత దేవర్ వెంటనే కృష్ణను ఒక తమిళ చిత్రంలోకి బుక్ చేసుకొన్నారు ఇక మీదట కృష్ణ కార్యక్రమం తమిళంలోనూ వుంటుంది నిటారుగా నిలిచి ఠీవిగా నడక అలవాటు చేసుకొని తెలుగు తెలుగు సంభాషణలతో ప్రజ్ఞ పెంచుకొంటే కృష్ణ ఇంకా ఉన్నత స్థానాన్ని అందుకోగలరని అభిమానులు అంటున్నారు

* * *

రాధాకృష్ణ ప్రొడక్షన్స్‌వారి సాంఘికం నిర్మాణం మద్రాసు గోల్డెన్ స్టుడియోస్‌లో శీఘ్రగతిని సాగుతున్నది హరనాథ్, శోభన్ బాబు, చంద్రకళ, సంధ్యారాణి, ధూళిపాళ మొదలైనవారు నటిస్తున్న ఈ చిత్రానికి కథ సమకూర్చి దర్శకత్వం వహిస్తున్నది ఎమ్. వాగేశ్వరరావు

## రాజాజీ కథ :

## తెలుగు జానపదంగా

గౌరీ ఆర్ట్ ఫిలిమ్స్ వారి 'దేవుని గెలిచిన మానవుడు' జానపద చిత్రానికి ఆధారం రాజాజీ రచించిన జానపదం రీడర్స్ డైజెస్ట్ వారి ఎమ్ ముస్లిమ్ జర్నల్‌లో అది ప్రచురితమైంది కథా సరిత్సాగరంలో కూడా అటువంటి కథ వుంది యూనిట్ వివరం - కాంతారావు, రాజనాల, చలం, మిక్కిలినేని, జి వి జి, జయకృష్ణ, వాణిశ్రీ, గీతాంజలి, పద్మరాజు, సి నారాయణరెడ్డి, వీటూరి, రాజన్-నాగేంద్ర, నరసింహారావు (కళ), చందు (కళ), ఎన్ భావనారాయణ (నిర్వహణ), వై వి రావ్ (నిర్మాత), హనుమాన్ కృష్ణమూర్తి (దర్శకుడు)

* * *

కమలాకర కామేశ్వరరావు దర్శకత్వాన 'కాంభోజరాజు కథ' నిర్మాణం జూన్ రెండవ వారంలో హుటాహుటిగా సాగింది గుమ్మడి, చలం, మొదలైనవారు పాల్గొన్నారు.

* * *

సురేష్ కంబైన్స్‌వారు మద్రాసు శివారులోను, బి. ఆర్. ఫిలిమ్స్ వారు అరణియార్ ప్రాజెక్టు వద్దను షూటింగులు జరిపారు.

♦♦♦

